శ్రీరస్తు.

---

శ్రీ వాసవాంబాయైనమః.

శ్రీమదుమారమణపాదారవిందమకరందపాన ప్రముదితహృదయులగు

శ్రీగురుభాస్కరాచార్యులచేత.

శ్రీమన్నిఖిలవైశ్యజనచిత్తాహ్లాదకరంబగునటుల

రచియింపబడిన.

---

ఈ వైశ్యపురాణము.

శ్రీమచ్చెన్నపురాభరణాయమానాదీశ్వరస్వాతీనిలయ వివేకరత్నాకర

ము ముద్రాక్షరశాలాధికారులయిన

వావిళ్ల॥ రామస్వామిశాస్త్రులచే.

పరిష్కరింపఁబడి

---

తదీయముద్రాక్షరశాలలయందు బెంగుళూరునివాసులును

శ్రీమద్వైశ్యకులావతంసులునునగు బట్టేపాటి॥ తిమ్మప్పశెట్టిగారికి

పుత్రుఁడును సజ్జనవిధేయుఁడునైన

వెంకటసామి శెట్టిగారిచేత

---

భద్రముద్రాక్షరములఁ ముద్రణము జేయించి

దుర్మతినామసం॥ మాఘశుద్ధ ౧౦ లు

ప్రకటింపఁబడియె.

---

మంగళమస్తు.

శ్రీరస్తు.

## అవతారిక.

శ్రీమన్నిఖిలమహీమండలమండనాయమానులయిన నిఖిల వైశ్యులకును ధర్మాది పురుషార్థచతుష్టయసాధకంబగునట్టుల పరమకారుణికుండైన సాలంకాయన మహర్షిచేత రచియింపఁబడిన వైశ్యపురాణంబను మహాప్రబంధంబు గీర్వాణభాషయందుండుటంజేసి సకలజన సుజ్ఞేయంబు గాకనుండుటవలన నతిసులభముగ దెలియునట్లు వచనరూపకముగ రచియింపఁ దలచియట్లుండెనే నియాధునికులును దమతమయిష్టానుసారముగ యుక్తులుగల్పించి లిఖించుటకవకాశముగల్గి పురాణమహిమ దొలగింపబడుననినట్లు జేయక శిష్యజనకోటి ప్రార్థితులై దయార్ద్రచిత్తులైననిఖిలతంత్ర స్వతంత్ర ప్రతిభాశోభితులగు శ్రీ గురుభాస్కరాచార్యులవారు నాగీర్వాణప్రబంధానుసారముగ సప్రమాణముగ నత్యంతోపయుక్తస్థలంబులయందు మాత్ర మాగీర్వాణపురాణవాక్యములను సంగ్రహించికొని నాంధ్రభాషయందు పద్యప్రబంధరూపముగ నేసి యిదియాఖ్యానములచేతఁ బూరణంబు చేసిరి యట్టిగ్రంథంబును విరళంబై యుండుటవలన జదువుటకు వినుటకును నిఖిలజనసుసాధ్యంబు గాకుండెగాన ! నట్టిగ్రంథము ముద్రింపజేసినయెడ లోకోపకారంబుగనుండునని తలంచి యచ్చువేయించడమైనదిగాన నో వైశ్యోత్తములారా మనకులాచారధర్మములకత్యంతావశ్యకంబైన నీగ్రంథమును సులభక్రయమునకు రప్పించుకొని యానందముతో పురాణశ్రవణపూజాదులకుపయోగించుమరని మిగులవినయముతో హెచ్చరించుచున్నాడను.

ఈ గ్రంథము చన్నపట్న ముత్తండియార్పేటలో వావిళ్ల రామస్వామి శాస్త్రులవారి ఆదిసరస్వతీనిలయ-వివేకరత్నాకరముద్రాక్షరశాలలయందు ను. బెంగుళూరు కోమటిపేటలో బట్టేపాటి వెంకటసామి శెట్టిగారి అంగడియందును విక్రయింపఁబడుచున్నదిగాన వలయువారలు క్రయమును బంపి పుస్తకములను తెప్పించుకొనవచ్చును

దుర్మతి నామసంవత్సరము
మాఘశుద్ధ-౧౦-లు

బట్టేపాటి తిమ్మప్ప శెట్టిగారి
వెంకటసామి శెట్టిగారు

# విషయసూచిక :-

## విషయసూచిక :-

## విషయసూచిక.



విషయసూచిసంపూర్ణము.

శ్రీరస్తు.

# వైశ్యపురాణము.

## ప్రథమాశ్వాసము

శా|| శ్రీకంఠుం డజగదేకనాథుఁ డభవుం డా శీతాంశురేఖోజ్జ్వలుం
డా నాకౌకప్రవరార్చితాంఘ్రికమలుం డానాగుణాధారుఁ డీ | లాకైలాసని
వాసు శైలతనయామోల్లాసప్రదుం డభక్తర | క్షాకారుణ్యకటాక్షు శంకరు మ
హైశ్వర్యుం బ్రశంసించెదన్ ||౧|| ఉ|| ఫాలవిలోచనాగ్నికణబంధురవైఖరిచి
త్రరూపమై | వ్రాలిన చాపమధ్యమున వత్తిలుచుం డవి వేషమధ్యమ | శ్రీ
లలితేందులీలపురజేత శుభంబులనిచ్చు నెప్పుడున్ | లాలిత నాకలోకసుర
లోకవచఃపరిపూర్ణకర్ణుఁడై ||౨|| సీ|| అఖిలవిశ్వములకు నాధారమగుతన
తనువు విశ్వలపురథంబు గాఁగ | కమలోత్పలంబులో క్కడ ముదంబుగఁ జేయ
జాలిన నిజదృష్టిచక్రములుగ | బ్రహ్మదేవుని సవ్యభావమై విలసిల్లు నిశ్వాస
పవనంబు లశ్వములుగ | వేల్పు మూకల కెల్లవీడు బట్టైయున్న ఘనతరమధరం
బు ధనువుగాఁగ | చారుమణిమయదివ్యభూషణమగుణము | లనగఁదనయంతనిత
రసాధనము లేక | ప్రకటదైత్యకులాహితబాణమునను | త్రిపురదైత్యులఁ గెలి
చిన దేవుఁ గొలుతున్ |౩|| శా|| శ్రీరాజన్మహిమానుమూర్తిం గరుణాసింధుం గ
జేంద్రాస్యు విఘ్నారంభప్రశిఖావుదానసులభుం ధ్యాతవ్యు దేవాధిపుం
వారగ్రీవుఁ త్రినేత్రు నైందవకళావ్యాసంగకోటీరు వి | శ్వాధారాంఘ్రి
యుగుం మహాగణపతిం బ్రార్థింతు నెల్లప్పుడున్ ||౪|| సీ|| దేవకీసుతు వసుదే
వమనోహరు నందగోపవ్రజానందకరుని | సముద్ధత పూతనాస్తన్యరుచిజ్ఞుని శ
కటాసురాంతకచరణకమలు | బ్రాచుర్య గోవర్ధనాచలోద్ధారమదోయ
జాసనవరస్తుత్యచరితుఁ | గాళియాహిఫణాగ్రకలితరంగస్థలినటనసం
క్రీడనత్రచారు | సబలచాణూరమల్లశిక్షాప్రవీణు | కంసగర్వాపహారణవిక్ర

మనకుఘనుఁ।భక్తవత్సలుఁ రుక్మిణీ ప్రాణనాథుఁ।గొలుతు శ్రీకృష్ణమూర్తిఁ సకుశ
లబుద్ధిఁ ॥౫॥క॥ సిద్ధపులొలు పలుకులుగల। పెద్దనితనుమునులువాఁడ పెనుజదు
వులచేఁ బుద్ధుల ప్రోగైహరిపె। న్నద్వైతగు బ్రహ్మదేవు నురుమతి గొలుతున్.
౬॥ఉ॥ వాణికి మ్రొక్కెదన్ లలితవాణికి నృత్యకృపాభిరతి తేజః। ప్రాణికి సత్వ
దభ్రవిరాజిత సౌరభ పుష్పమాలికా। వేణికిఁ గింకిణీగణనలీనసుణాంచితనా
దవేఖలా। శ్రోణికి నల్లకీకమలశోభితపుస్తకకీర పాణికిన్ ॥౭॥ఉ॥ శ్రీరమణీ
మనోహరు విరించి శతక్రతు వీతిహోత్రప్రవం। కేరుహమిత్ర చంద్రబుధకీ
ర్తితమూర్తిని భక్తవత్సలున్ । గారవ మొప్ప వైశ్యులకుఁ గామిత సంపదలి
చ్చు దేవునిన్। హేమవతీరవణున్ నగరేశ్వరు నీశ్వరు నాశ్రయించెదన్ ॥౮॥క॥
దలతు జనార్దన దేవుః। కలుషమహాతిమిర నికర ఖండన కేళి। జలరుహ బాం
ధవు దానవ। కులశిక్షాదక్షు జగదకుంఠితమూర్తిన్ ॥౯॥ఉ॥ శ్రీలావణ్య శ
రణ్యపుణ్యకరుణా శృంగారసంరక్షిత। హ్మాలక్ష్మీశుభ భారతీశ శుభ వాక్య
శ్లాఘ్యు పిశ్వంభరున్। బాలేందూజ్జ్వలశేఖరున్ శిఖరికన్యామాన్య వామాం
గునిన్। మూలస్థాన మల్లికార్జునశివున్ మోదంబునన్ గొల్చెదన్ ॥౧౦॥
ఉ॥ శ్రీమణీశు శంకరు విరించిను శిందిరమాద్రిపుత్రికా। భారతులన్ దలం
చి గణపాలకుఁ బ్రార్థన జేసి షణ్ముఖాం। భోరుహ మిత్రులన్ గొలిచి భూరి
రసార్ద్ర కవిత్వతత్త్వల।క్ష్మీ గమణీయులన్ మిగులఁ జిత్తమునన్ గొనియాడి
వేడుకన్ ॥౧౧॥సీ॥ పదపదార్థజ్ఞానభాషావిధానముల్ వ్యంగ్య నానావస్తువ
ర్ణనములు బహువిధాలంకారభావక్రమంబులు శబ్దప్రయోగరసజ్ఞతలును
ఛందోవిశేషలక్షణలక్ష్యభేదముల్ కవిసమయము చమత్కారములును। గ్ర
హశత్రుమిత్రవర్గ గ్రహఫలములు రీతిశయ్యా పాకనీతి విధులు । గద్యప
ద్యచతుర్భద్ర ఖడ్గచక్ర। మురజగోమూత్రికా నాగముఖ్యబంధ। కావ్య రచ
నల నెరిగిన ఘనుల నాది । కవుల నభినుతి జేసి తత్కరుణ మెరసి॥ ౧౨॥వ॥ మరి
యు వద్గురునాథకటాక్షవీక్షణప్రకటితానుగ్రహంబున నేతద్దేవతా ప్రార్థన

సంబోధరించి వసిష్ఠాత్రిగౌతమపరాశరవేదవ్యాసముఖమహామునీంద్రులను
భక్తిం దలంచి కాళిదాసబాణమయూరమాఘభారవిశివభద్రమహాప్రాజ్ఞప్రము
ఖనిఖిలకవీశ్వరకృపారసధారాప్రవర్ధమానవచోవిలాసభాసమానుం
డనై యొక్క ప్రబంధంబు రచియింపం దలంచుచున్న సమయంబున నష్టాదశప
ట్టణంబులయందుగల నూటయేబండ్రు నగరస్వాములు పెనుగొండపట్టణంబు
నన నగరేశ్వరుని ముఖమంటపంబున ధర్మసింహాసనాసీను లైకులాచార
ప్రతిష్ఠాధురంధరులై మహాప్రతిభ యొనర్చి కులాచార నిర్ణీత సమయ
బహిష్కృతులై పరచిన కమ్మరవగోవతూపు నాటి ముష్కృతులదూ
షితులం జేయుచు తథావిధప్రతాపప్రశాసనకనకస్తంభంబున నగరేశ్వర శ్రీ
మన్మహాదేవుని సమీపంబున ప్రతిష్ఠించి యున్న సమయంబున॥౧౩॥క॥ తారా
గణములలోపల। తారాపతింబోలి యున్నధన్యునిసభలో। భూరిప్రజ్ఞఘనేంద్రు
ని। గౌరవమున భాస్కరార్యుగను గొని యంతన్॥౧౪॥క॥ కుమిగూడి వైశ్యసం
ఘము। రమణతకుల గురువు భాస్కరార్యు పదాంభో। జములకు సాగిలి మ్రొ
క్కుడి। క్రమమొప్పగ లేచి నిటలఘటితాంజలులై॥ ౧౫॥సీ॥ ద్విజవర్య వైశ్యు
లాయజునూరు జన్ములై ధాత్రికేతెంచినతద్విధంబు। శాపముచే నీశ్వరుకృపచేత
కైలాసవాసంబు గంధర్వవైశ్యవరుల। శాపంబు శైలజ ద్వాపరవేళ వైశ్యులను
భూలోకంబు చేరననువుట। ద్వినవపట్టణముల విభవాదిపత్యంబు పుత్రకామే
ష్టి చేబుత్రిగనుట। కుసుమశెట్టియు వాసవకోమలాంగి-నధిపుడడుగుట నూట
మూండనలకుండ-ములనుబడి వైశ్యులత్తరిముక్తిగనుట-విప్రకులముఖ్యమాకదిని
స్తరింపు॥౧౬॥సీ॥ వల్మీకభగవద్గుడు వాల్మీకి జెప్పిన రామాయణము లోకరమ్య
ముర్యో-వ్యాసమహాముని వాసికెక్కంగ జేసె పాండవేయుల పేర భారతంబు
వరుసనాగార్జునశక్రవర్తులు రాజులు బదియునార్వురం జేసె బరగ కృతులు
అట్టిపురాణంబులలరంగ విన్నను బఠియింప లిఖియింపం బాపహరము-లైనవిధ
మున మాపనీయమల వాక్య - కావ్యమబ్బిన రవిసుధాకర ధరాబ్ధి తారకా

దీని ద్రుతెందాక తనరనిలుచు నంతగాలంబు సత్కీర్తి యలరు భువిని ॥౧౭॥
క॥ బుధజనులు బొగడఁ గవితా। మధురసుధారసవిభాసమానం బై భూ। ప్రథితు
లు మెచ్చఁగఁ దెనుఁగుగు। విధమున రచియింపు కృతి నవీన ప్రౌఢిన్ ॥౧౮॥ క॥ ధరణీసు
రపరిణయమును। సురభీవనమును పవనంబు సూనృత పద్మా। కరమును మహానిధాన
ము। సరసస్ఫూర్తి గృతియు సప్తసంతానంబుల్ ॥౧౯॥ గీ॥ సుతనిధానంబు గుడి
యు భూసుర ప్రతిష్ఠ। వనతటాకము కృతులను వార్ధిసంఖ్య। యుర్వి నెందుం
డునంకుందు నెంక్కకృతియు నొక్కటై వికృలం దెల్లఁ బెక్కటిల్లు ॥౨౦॥ ఉ॥
భారతరామసత్కథలు భాగవతంబు దెనుంగు సేయఁగా। నేరరెనత్కవీశ్వరు
లు నేర్చి రచించినసత్కవిత్వముల్। మీరు దెనుంగు భాసనిల మెచ్చఁగ నొక్క తె
నుంగు గ్రంథమిం పారఁ బ్రసిద్ధి సేయుమహిమంబలి నొప్ప గపండితాగ్రణీ
॥౨౧॥ క॥ అనితన శిష్యులు వేడిన। జనితానందంబు నొంది సౌలంకాయుండను
ముని జెప్పన కై వడి। వినుపించెద వినుఁడటంచు వికచాననుఁడై ॥౨౨॥
క॥ చెప్పెదసుకవుల చెవులకు। జిప్పిలనమృతంపుసోనజిలికిన మాడ్కిన్। కప్పు
రము విరిబోట్లము విప్పినఁ గ్రిందునొకరికొకరి విప్పసుగీతుల్ ॥౨౩॥ క॥
అనితన మనమునఁ బొంగుచు। మనమున నొక చింత నొందమానసవీధిన్। గనుగొ
ని వైశ్యులు గురులగు। విను తింపుచు మ్రొక్కి లేచి వినయాన్వితుఁడై ॥౨౪॥
చ॥ కలియుగవేళ గానఁదగ కన్యక కట్టడరీతి శేయదో। వలమున్నొక్కఁడేన
తనిజాడను బెద్దలు బుద్ధిహీనులై। మెలగిన తొట్టుదీతురని మీమది నుండెడి
భంగి దోచనీ। యలమను నాథకీర్తి సుగుణకోవిద చెల్లెలి కట్టసెప్పరో ॥౨౫॥
ఉ॥ రాజపరాశ పించుతరి వన్నని మిమ్మటు చేరబిల్చి యం। భోజదళాక్షివా
సవియొభోరున మేఘసుగర్జితంబుగాం। బూజితు లెల్ల కాలమును సుఖ్య వ
రోహితులౌట కట్టడన్। దేజమెలపఁ జేస్తిమని చెప్పె నబుద్ధులు నాలకింప
రే॥ ౨౬ ॥ క॥ కొట్లాట రాదు మాపఁడి। మాట్లాడగ రాదు వీరు మనగురువులు
మే। మెట్లా సేయ కట్టడ। నట్లా సననడవ వలయు నభఁ ఘసులారా ॥౨౭॥

శా॥ జాతుల్ రెన్మిదియారునాల్గువివిజాతీశాఖాప్రభేదంబులీ। రీతుల్ యీకు
లమందు లేదుయిక మీరీచందమై మిమ్ములన్ । భీతిన్ సేయక కర్మభేద
ములై వేదద్రోహులై వామలై । మాతాపితృవిరోధులై చెడుట నేమం
బంచుశాసించెగా । ౨౮ ॥ ఉ॥ మాకులమందు బాసిచను మత్యులు మేల్
పరజాతులందరల్ । ప్రాకటమైనవస్తువులుభక్తినొసంగిననాదరించి
నన్ । మీకటనీతిగాదుచనమీకును మేమును మాకు మీరునై । యేకతమై చ
రింపుడని యీశ్వరు పాదములాన చెప్పవే । ౨౯ । చ॥ అలసిన లేవకున్నరెం
డు రాడినతిట్టినకోపగించినన్ । పొలసియు లేదటంచు వృథసుద్దులు చెప్పిన మిత్రు
త్వకుండినన్ । పలుకక యున్నను గినుకబడ్డ హితుండగు నంచు ణ్యదా । నల్ల
సిశపింపవల్లనుచునం ఘ్రులపై బడిసన్నుతింపవే ॥ ౩౦ శా॥ న్యాయత్నముతోడ
న్నిట్లు స్తుతుల్ గావించి ప్రార్థించినన్ । ధన్యత్వంబున నొప్పగించి ముని వా
రిన్ జనన్ బ్రోతు రే। సన్న్యాసైన పితంతురాలువణిజై సత్ప్రాణి ర్వైరాజుచే
మాన్యంబై నను మీకు వర్తనలిడన్ మర్యాదగావించవన్ । ౩౧ । ఉ। స్వా
ర్య కరాభిజ్ఞాతస్య పసోముల కర్థిన వశిష్ఠ ధౌమ్యులా । చార్య పురోహి
తుల్ నటులనత్తమ మాకు పురోహితుల్ కలా । చార్యులు మీవచస్థితుల
జాడ జరింపకనొండజేసిన । నార్యులు మెత్తురే యతడు యార్యుడె యార్యవ
రుండు బ్రోచునే । ౩౨ ॥ ఉ। ధర్మయుగంబునన్ దగవు దప్పియు యాత్రివ
రించెభాగ్యవిన్ । బేమిన నియాంబికే యుడను పెండ్లియాడెను వైశ్యకన్య
కన్ । నిర్మలు విష్ణువర్ధనుని నీరుగ నేసురునుం సురెండు ముకాల కార
ణత్వముగకల్పగమీకు సువిన్నవింపవే ॥ ౩౩ ॥ మ॥ ఘనవంశంబుల వారు నిట్లున
ఘువర్ణ కల్యాదిముందెట్లకో । మనుజుల్ ద్రోహులు క్రూరులల్ప కులజుల్ మ
త్యేశులై జొచ్చిన । న్ననఘాయీ తెగువెందు నర్గలుగునే నానాట్రికోత్రో
వామీ । ఘనవిద్యాకుశలత్వ సద్గుణములను పేరుల్లేక రక్షింపవే ॥ ౩౪ । ఉ॥
కావునమచ్చరిత్రమును సకన్యకసాహసకాలంబులన్ । దేవప్రబంధరూప

ముగ దెల్లముగాఁగ సవిస్తరంబుగా। భూవలయంబున నెగడి పూర్ణత దిక్కుల్
లుప్పొంగుచుండగా। భావజరూపమీతెగలు బల్కఁగ మాకల వాధిఁ యుబ్బదే ॥
౩౫ ॥ మ॥ తెనుఁగుఁ గావ్యము జెప్పవయ్య వ్యాద్యమై దేశీయమై భావమై।
వినసింపై సరసత్వమై విరళమై విఖ్యాతమై కీర్తిదమై। జనితామోదక హృ
ద్యశద్యకరమై సద్ధర్మసంచోద్యమై। తనరంగ బల్కవె చింతయేల్లయనుచుం
ధర్మజ్ఞ భాషింపదే। ౩౬ ॥ ఉ॥ వాసవకన్యకామణియు వైశ్యులునారో
కరధిఁ సేయునా। భాసురమైన కట్టడ ప్రపంచముఁ గల్గినయంత కాలముం। మీస
ముఖంబు వారడుఁగ మేము సమర్పణ సేతుమయ్య యా। చేసిన కట్టడల్ సరకు
సేయని ద్రోహకులంబు కష్టాడె॥ ౩౭ ॥ చ॥ అనఘ సప్త కమర్దశ
ములగ మాబ్దిక క్రాంత వ్రతోపవాసత। ద్దినములమిమ్ము జేరడుగ తేర్చినకై
వడి సేతుమయ్య మీ। యనుమతి లేక యోగ్యుఁడనియావల వేరొకవి క్రుకియ్య
బల్గిన మాలు ముప్ప దేవతలు దిట్టకరౌరవముం దుఃగూలరే। ౩౮ ॥ ఉ॥ యి
వ్వాడునిన్ను వేడెద ముయెన్నిక మీరగ నీ ప్రబంధము। న్నొప్పను శాస్త్ర సంగతి
వ్యాఖ్యాతిగ జేసిన సప్తతంతువుల్। విప్రసుమాకునంచు బహువిశ్రుతవాక్యతి
భాధురీణులై। కప్పురముం నుచేలములు గణ్యవిభూషలునిచ్చియింతటం ॥
౩౯ ॥ వ॥ వినయంబొనరించిన నమ్మహానుభావుండిట్లనియె॥ శా॥ మీకన్యామ
హిమంబు మీకునడకల్ మీదివ్య చారిత్రము। ల్లా కైలాసపదంబునందు తెర
గున్నాయంత ముం జెప్పెదం। లోకుల్ మెచ్చ కవీంద్రకోటి పినియాలోకించి
మేల్మేలన। న్నాకల్పాంతము నుండు మీ సుచరితము న్నాచంద్రతారార్కమై॥
౪౦ ॥ వ॥ అనిమరియు రియాదరించి పలికిన పరమానందకందళిత హృదయార
విందుండనై గుణవంతులగు వైశ్యవరులకృతికి నధినాయకులం జేసి వైశ్యచరి
తోపక్రమణకుతూహలుండనగుట ॥ ౪౧॥ క॥ నగరేశజనాదర్శనులను। యుగ
జను నాకోనక మలన వ్యాసవినీ। గగనెంచి సత్కృపారస। ముగణితముగ కా
వ్యరచనకారంభుండనై॥ ౪౨। క॥ బుధజనులు వొగడ కవితా। మధురసుధా
రసవిభాస మానంబై భూ। ప్రథితులు మెచ్చగ తెనుగగు। విధమునరచియింతు

గృతినవీన ప్రౌఢిఁ ॥ ౪౩ ॥ శా ॥ ఆపస్తంబమహామునీశ్వరజగద్వ్యాపైకశ్రౌ
తసూత్రుఁడవిద్యాపాథోనిధిగౌతమాఖ్యమునిగోత్రాధికృష్యుఁడఁ ప్రోల్ల
సచ్ఛాపానుగ్రహవాక్యమర్దితనృపశ్లాఘ్యుఁడు పెన్గొండపు। ర్యుపకణ్వో
ద్యనివాసభాసితుఁడు ధాత్రీదేవతామాన్యుఁడౌఁ ॥ ౪౪ ॥ క ॥ సల్లలితలక్షణో
క్తుల నుల్లసితకవిత్వతత్త్వయుక్తుఁడనుమనః పల్లవితకీర్తిలతికో ద్వల్లితమా
రిదంతరుండ ధృతిభాస్కరుఁడౌఁ ॥ ౪౫ ॥ వ ॥ అని దన్మునభివర్ణనంబు జేసి కో
నిసద్గుణమణిరత్నాకరులగు వైశ్యవరులపురంబెట్టిదనిన ॥ ౪౬ ॥ సీ ॥ ఏపు
రంబుననుండు నెలమిమూలస్థానమల్లికార్జునుఁడు శ్రీమండనుండు ॥ ఏపట్ట
ణంబున గోపికాపతి వైశ్యమర్దనుండైన జనార్దనుండు ॥ ప్రవహించు భూస్థలి
బ్రాహ్మ్యాగమునఁ బెట్టకడవి రాయనికొమ్మ గౌతమమ్మ ॥ ఏవీట చెలువొందు
నే ప్రౌఢగురుణతో విశ్వనాథుని దేపవింధ్యవాసి ॥ విప్రబాహుజవిట్పాద్ర
విమలహర్మ్యాగ్రకూటసంస్థాపితస్వర్ణకలశదీప్త ॥ జాలభాసిత బ్రహ్మాండ
గోళకంబు ॥ ధరణిస్వర్గంబు పెనుగొండపురవరంబు ॥ ౪౭ ॥ సీ ॥ ప్రవహిం
చు నేవీట బ్రాహ్మ్యాగమునమించి శ్రీమత్తరంగవాసిష్ఠగంగ ॥ డపిఁచు నేవీట
దక్షిణంబున దుర్గకాసారపురి మేలుఘనుఁడు శివుఁడు ॥ పాలించు నేవీట పశ్చి
మంబున నునుగౌరీశ్వరుండైన రామేశ్వరుండు ॥ యోజించు నే వీటను త్తరం
బుననుండి యంబుజాక్షుండు జనార్దనుండు ॥ అట్టిపురవర మఖిలవిద్యాధురీణ
వైశ్యవంశపరాక్రమవర్ణనీయ ॥ సరసవితాతుర సంపూర్ణశాసనాగ్ర కీ
ర్తనీయంబు యమ్మహాగిరివరంబు ॥ ౪౮ ॥ ... ... ... ... వచనము ॥
మరిన భ్రంకష ప్రభూతకుంభ కుంభత్సు ధాధవళి మ ప్రాసాదవివిధబంధ
బంధురంబును ॥ గళదసింధురఘటాకటతటఘటితగళన్మదధారాకదంబజం
బాల రాజమార్గ నిరర్గళశోభాశోభితంబును ॥ దీర్ఘ లంఘనజంఘాలవి
శుద్ధసత్వలక్షణలక్షితోత్తమతురంగమప్రకరబంధురంబును ॥ గౌతమీస్నాన
విధూతనిఖిలకలుషవిరహితసత మార్గస్థానగరిష్ఠవేదశాస్త్రపురాణేతి

నానాకావ్యనాటకాలంకారనిరవద్యవిద్యావైదూష్యమేధాధురీణధరణీసురవరాకీర్ణంబును।శరణాగతరక్షావిచక్షణమత్తశిక్షాకరణప్రవీణశౌర్యాదిగుణరాజిరాజమానమహాకులీనరాజన్యధన్యంబును।కర్పూరకస్తూరికాదిసమస్తవస్తువిస్తారితరచిత్రచీనీచీనాంశుకప్రకరనివహాణవైశ్య జనంబును।మధురవాక్య కవితానవార్థనకవితాధరామనోహరంబును। రంభోర్వశీసదృశలావణ్యవిభ్రమకళాకుశలగణికామండితంబును।వికచప్రసవసుగంధబంధురమదాంధపుష్పంధయవధూమధురనిరంతరఝంకారశ్రవణలోలుపపుష్పలావికానికాయనికేతనంబులును। నవోత్కంఠకలకంఠశుకచంచరీకమనోహరరసాలతమాలహింతాలనారికేళచంపకప్రముఖభూరుహోద్యానహృద్యంబును।కుముదకువలయారవిందసౌగంధికపరిమళమిళితశీతలఝరీగసరోవరవిరాజితంబును। పరిపంథిభయదప్రాకారసముచ్ఛ్రయపరివేషగండూషితబ్రహ్మాండమండలంబును॥కాలంకషాఖాతవిషమపరిఘశ్లాఘనీయంబును। రంగత్తరంగమంగళసముత్తుంగగంగాతరంగిణీపశ్చిమతటప్రసిద్ధశ్రీపిలమల్లేశ్వరాగణ్యభక్తజనశరణ్యకారుణ్యకటాక్షరక్షితంబును-నిఖిలసంపదావాసనివాసభాసితంబును నై- యొప్పునప్పెనుగొండపురవరంబునందు॥

క॥ రాజకళాధరభక్తులు। రాజోపమహావ్యయాధరంతలువిద్యాభోజులు దనరిరి వసుధన్। రాజిత పెనుగొండనగరరాజద్విప్రవర్యుల్।౫౦॥

సీ॥ శ్రీనగరేశ్వరశీతాంశుశేఖరపాదసరోరుహభ్రమరమతులు।గోగజహయతిలభూహేమముఖ్యషోడశమహాదానాది।విశదమతులు-దేవగేహాగ్రహారదీర్ఘికాకావ్యనిధానాదిసప్తసంతానఘనులు। వాణిజ్యకృషివృద్ధివర ధేనురక్షణ చతురాఢ్య జీవనశాలియుతులు:-యజనదానాధ్యయనకర్మభజనవిధులు। జగతిఁబెనుగొండపురవరశాసనాంకులనగ నన్నుతిగాంచి నిరంతరంబు-నలరుదురు వైశ్యులతిధర్మనిరతులగుచు॥ ౫౧॥

సీ॥ వితరణగుణధైర్యవిశ్రుతభుజశౌర్యసంభవమహైశ్వర్యవిభవయుతులు।ధర్మశాస్త్రాధారనిర్మలవ్యాపారసతతమహోదారశాంతమతులు। వినయదక్షా

మూలవిశదయశోలోలవిపులగుణావాలవిమలమతులు ॥పరమసత్యజ్ఞానభ
వ్యవిద్యాస్థానవటుబుద్ధిధనమాన భాగ్యఘనులు। నాగంబెనుగొండయనుమహా
నగరమందు। నలరుమరువైశ్య లతిధర్మనిరతులగుచు।సకలగుణములదానవి
శ్వాసనియతి।ధర్మదాక్షిణ్య గుణములందరమెఱుగడ॥౫౨॥క ॥రాజితమూ
ర్తీ-జనార్దన। రాజీవోదరునిపాదరాజీవాళుల్ । భ్రాజితసాత్త్వికులుధ
ర్మ-। రాజితపెనుగొండ నిలయరాజద్వైశ్యుల్ * షష్ఠ్యంతములు *క॥
అంధ్యని వారితమతులకు।సంధ్యాజప హోమముఖ్య సత్కర్మములకున్ ।విం
ధ్యావాసినిపదసంబంధ్యామోదాభిలోలబంభరములకున్॥౫౪ ॥క ॥కరు
ణాకరులకు పండితవరపారంపర్యభాగ్యవర్ధితులకుని । భర్మకీర్తిసతీప్రి
యులకు।సరసగుణాఢ్యులకునీతిచాతుర్యులకున్॥౫౫॥క । నగరేశ్వరభక్తి
కను। నగరాధీశులకుసర్వనగరాఢ్యులకున్ । నగరాంకస్థితమతులకు। నగ
రస్వాములకు బాలనగరాఖ్యులకున్।౫౬॥క ॥ శివపూజాతత్పరులకు।వివిధ
పురాణేతిహాసవేత్తలకుసుగుణ।త్వవిగాయకకల్పకులకు।నవరసరసికులకు బా
లనగరాఖ్యులకున్॥౫౭॥క॥భవ్యులకునునీతికళా।కావ్యులకుసుధాంబురా
శిగాంభీర్యులకున్ ।దివ్యాధివవైభవులకు।నవ్యయశస్కులకు బాలనగరాఖ్యుల
కున్॥౫౮॥క ।ధన్యులకూరుజకులమూ।ర్ధన్యులకునమస్తవస్తుధనధాన్యరమా
ధాన్యాగ్రహారబహుతర।కన్యాదానప్రదానగరుణాత్ములకున్।౫౯।వ॥అం
కితంబుగానభ్యుదయపరంపరాభివృద్ధిగాపుత్రపౌత్రాభివృద్ధియగునట్లు
గానారచియింపంబూనిన వైశ్య పురాణంబెట్టిదనినసర్గప్రతిసర్గవంశమ
న్వంతరవంశానుచరితంబను పంచలక్షణంబులు పురాణంబులకుంగార
ణంబులుగావునమున్ను నైమిశారణ్యంబుననానేకమునిగణంబులుగొలువను
ఖాసీనుండగుపాలంకాయనమునీశ్వరునకువైశ్య మునులుసాష్టాంగనమస్కా
రంబులొనరించిశ్రుతాంజలులైమదీయవంశవృద్ధానుచారలక్షణంబులవిశే
షంబునుగృపాయత్తచిత్తంబునక్రొత్తక్రొత్తలగుసుధాసదృశకథాపూరంబులు
తిరంబులుగానానతీవలయుననిననమ్మహానుభావుండుభూతభవిష్యద్వర్తమా

మానజ్ఞానమహనీయుండగుటం జేసిమున్ను గీర్వాణభాషఁ బురాణరూపంబు
గా నుపన్యసించె నా పురాణంబు నిఖిలజనవేద్యంబుగా నాంధ్రభాషా ప్రబం
ధంబు నిర్మించెద నందు సృష్టిప్రకారం బెట్టిదనిన॥౨౦॥ శా॥ సర్వోత్కృ
ష్టుండు సర్వనేత్రుండు మహాసర్వాధిపత్యుండగుచు। శివుండవ్యయుండీశ్వ
రాఖ్యుండు ప్రపంచంబెల్ల కల్పించుచున్। దుర్వారుండయి సంహరింపుచు
మహాస్థూలాదిసూక్ష్మప్రభా। భర్గజ్ఞానధురంధరుండు గలఁడోంకారాత్ముఁడీ
శుండనన్॥౨౧॥ వ॥ అమ్మహానుభావుని మహనీయప్రభావం బచింత్యం
బశక్యంబగమ్యంబు వేదంబులకు నవాఙ్మానసగోచరంబులగుటం జేసి దిక్కు
వడి భయంబున నుతియించు విధం బెట్లనిన। జయజయ మహాదేవ నవఖండనిర్మి
తంబైన భూమండలంబు రథంబుగా రథమధ్యంబుననున్న కర్బురనగంబు
విల్లుగా విల్లు మోపిన శేషాహి నారిగా యానారి పైశయనించు దేవుండు శరం
బుగా శరంబున బుట్టిన వాఁడు యంతగా యుత్తముఖంబున జనియించిన మేమ
శ్వంబులుగాఁ జేసినట్టి రథంబునకు వినతకద్రువలు మొదలైన వీరపతివ్రతలా
వరణదేవతలుగాఁ జేసి యశ్వినిదేవతలను పగ్గంబులుగాను బేరాదులైన యు
డ్డులు తోరణంబులుగా రవిచంద్రులు బండ్లుగా విప్రక్షత్రియవిట్శూద్రజ
నంబులు బండికి సుబ్బలుగాఁ జేసిరు గ్వేదంబను హయంబుమీఁద వామపాదం
బును బసవేశ్వరుని మీఁద కుడిపాదంబును బెట్టి నందికేశ్వరు రథంబునకు పెక్కైం
బుగట్టి శ్రీమన్నారాయణ బాణంబునకు చంద్రుండు ములికి ఫణిరాజు విషం
బు ములికి మొనకు పట్టించి దక్షిణముఖంబుగా రథంబు నడిపించినఁ ద్రిపురదా
నవులు దేవతలతోఁ గలపడి పోరాడు సమయంబున దేవతలచేత రాక్షసులని
హతులయిన రాక్షసులఁ ద్రిపురమధ్యంబున నున్న పరిపూర్ణార్ణవంబున
కు సదృశమైన సుధాహ్రదంబున ముంచి బ్రదికింపుచు వచ్చి నం జూచి యాది
త్రపిచిత్రంబునకు బెరగువడి మీకు విన్నపించిన నెఱింగి శ్రీమన్నారాయణుండు
వృషభేశ్వరుని కెఱిఁగించిన వారు పినియావనంబున ముంజని రాక్షసులెవ్వం
గకుండ నా హ్రదంబు నమునింగి కాన రాకుండ నయ్యమృతంబు ద్రావిన బారె

రింగిజడిసియాగ్నేయభాగంబునఁద్రిపురదానవులురథంబులతోఁజనినవారి
వెంటనేమీరథంబుదాకినమాత్రముననోర్వజాలకపశ్చిమమొగంబై వారు
ప్రతీచీసముద్రమధ్యంబుసొచ్చినతోడనే మీ రథంబు వారి పురంబుల వె
న్నంటసురజ్యేష్ఠుండు మీరథంబు గదియనడపించినవారు కెరలిమరలితిరిగిచే
సినయుద్ధంబుఘోరంబయ్యెనాసంగ్రామంబునవారిచేత శివకింకరులుభీతు
లైనవారికినీవుబలంబిచ్చినసుభయబలంబులు పోరునెడ నాయుద్ధంబుమ
హాద్భుతంబయ్యెనట్టియెడ రాక్షసబలంబునిహతంబైపడిన రాక్షసులను
కూర్మనక్రతిమితిమింగిలంబులుభక్షింపందొడంగిన వారలుమీ మొనల
కునిల్వకసముద్రంబువెలువడివచ్చి నవారింగనినీరథంబువోలుటయు వారు
మవీరావేశంబునం దిరిగి తెంపునగుంపులైమీనలేర్పరించికొనియుద్ధంబునకు
ప్రవేశించునాసమయంబునమునిసినరథంబులునుతునుకలైనకళేబరంబులును
విచ్ఛిన్నంబులైనకబంధంబులునై విరిగిపరచినన వ్వేళఁద్రిపురమధ్యంబున
నున్న మీభక్తుండు స్తుతించిననోడకుండుమునిదయదలంచియున్నింపితినని
యనేకవిధంబులవేదంబులుస్తోత్రంబులుచేసినమాత్రంబెకానినీమూలంబె
రింగియథార్థంబుగానింతటివాడననుతింపశక్తులుగారుగావుననీమహిమ
దెలియబ్రహ్మవిష్ణుముఖరదేవతాగణంబులకుబుధులకుందెలియనివాడ
నియనేకవిధంబులంబలుకుగావుననస్మదాదులకుదత్ప్రభావంబెఱుంగింపనల
విగాదెననుభక్తవత్సలుండనువాక్య పరిపాటింజేసి బ్రహ్మవేత్తలగుమునీం
ద్రులుపన్యసించినచిరంతనకథాశ్రవణజ్ఞానవిశేషంబునంజేసిసంక్షేపమా
ర్గంబునంజెప్పెద వర్తమానసౌరమానసంవత్సరంబులుకృతయుగంబున
కుబదినేడవలక్షలనిరువదెనిమిదివేలు - త్రేతాయుగంబునకుపండ్రెండుల
క్షలతొంబదియాఱువేలు-ద్వాపరయుగంబునకు నెనిమిదిలక్షలనరువదినా
లుగువేలు -కలియుగంబునకునాలుగులక్షలముప్పదిరెండువేలు-యీయుగ
చతుష్టయంబుగూడిననొక్కమహాయుగంబమ్మహాయుగంబులుడెబ్బదియొ
క్కటిచననొక్కమన్వంతరంబు(మనువులుబదునలువురుచన బ్రహ్మదేవునకు

నొక్కదివసంబగు। నేతద్దివారాత్రక్రమయుక్తంబునసంవత్సరశతంబతనికి
వరమాయువు-నూరుబ్రహ్మకల్పంబులుచనదీర్ఘాయుష్యుం డగుమునీం
ద్రునకునొక్కదినంబగు-నమ్మునీంద్రులిరువదికోట్లుచనరోమహర్షున
కొక్కరోమంబూడు-రోమశులుముప్పదికోట్లుచనవిూనజునకుఁబొరచిప్ప
దొలంగు।నమ్మీనజులుపదికోట్లుచనవష్టావక్రునకునొక్కడొంకువక్కనగు
నష్టావక్రులెనబదికోట్లుచనపాదలోచనునకునొక్కనిమేషంబగు।పాద
లోచనులేబదికోట్లుచనశ్రీమన్మహాదేవునకునిమిషమాత్రంబగునమ్మహా
త్మునకుంగాలాతీతుండనుపేరువచ్చుటకునేమిసందియంబు-నమ్మహాదేవుం
డుసృష్టిసంపాదనాయత్తచిత్తుండై నిజజ్ఞానానలభస్మీభూతప్రపంచభూ
షితుండై సగుణతత్వంబునప్రసన్నుండగుచుసంకల్పించినతదనంతరంబ॥
౬౨। చ॥ వెరవగునీశ్వరాజ్ఞప్రభవించిరి బ్రహ్మయువిష్ణుదేవుఁడుఁ।హరుఁ
డుచరాచరాత్మకచయంబులకుద్భవరతుణక్రియా। హరణగరిష్ఠులైతన
యహంకృతిమించివిరించిలోకముల్।వరగసృజింపగాఁచలచిభవ్యము॥హాత్వ
ముజూపునవ్యోడ్లు॥౬౩॥ చ॥ శిరమునభంబరస్థలముచిత్తమునంవిధుఁడాన
నంబునన్।సురపతివహ్నివిప్రులుసుసూర్యుఁడుకన్నులసవ్యదిక్కులున్।వరు
వడికర్ణరంధ్రములప్రాణములన్శవనుండుబాహులన్।న్నరయగరాజ
రాజియునునంచితనాభిసమాంతరిత్తుముల్॥౬౪॥ క॥ ఊరుతలంబునవై
శ్యులు।చారణసతినొప్పుచరణసరసీజములన్।భూరమణియుసచ్ఛూద్ర
లు। గారవమునబుట్టిరట్టిఘనతరమహిమన్॥౬౫॥ వ॥ మరియుసీభూతధా
త్రివలననతలవితలసుతలరసాతలతలాతలపాతాళంబులును॥భూవలోక॥
సువలోక॥మహాలోక॥జనలోక॥తపోలోక॥సత్యలోకంబులును॥
త్రయస్త్రింశత్కోటిదేవతులును। యేకాదశరుద్రులును॥ద్వాదశాదిత్యు
లును॥ నవబ్రహ్మలును।నష్టదిక్పాలక దిగ్గజసప్తమాతృకమహామునివారిధి
ద్వీపశైలంబులును॥మహానదీనదంబులును॥షడుత్తరపంచాశద్దేశంబులును
రక్షోపక్షిగంధర్వసిద్ధవిద్యాధరకిన్నరకింపురుషనాగఖేచరవిశేషంబులును

చరాచరంబులులోనుగాగలనమస్తస్థావరజంగమవిశేషంబులుంగలిగెనని సాలంకాయనఋషివర్యుండానతిచ్చినవినియత్యంతసంతుష్టాంతరంగులై యవైశ్యమునులుసాష్టాంగనమస్కారంబులాచరించిముకుళితకరకములైబ్రహ్మోరుసంభవులగువైశ్యులెందరు‌*వారిసంతులెందరువారికి జాతకర్మాదివిధానంబులెవ్వరొనర్చిరి *తదనంతరకథావిశేషంబులేమో వంబునంబ్రవర్తిల్లెనానతీయవలయుననియడుగుటయును ॥ ౬౬ ॥ ఉ ॥ శ్రీరమరాళహారవృషభేశఫణీశ్వరశర్వరీశవా। క్ష్మారదమేఘనారదసుగంధసమున్నతపుష్పవల్లికా। హారవటీరమారహరయాదవరాడ సుధాంబురాశిడిం। డీరవిశాలకీర్తులలువణిక్ప్రవరుల్మహిమాత్ములిష్టహీ ॥ మాలినఃనిజకులభవకన్యా। నిజితారాతిభవు।ల్సుజననివహా సేవ్య।లోభనోత్సాహదివ్యు।ల్కుజననివహాదూరుల్కుంతి తారిద్రవారు।ల్నిజచరిత్రవిలస్ప్రశ్న।ల్నిమలలుల్నాలవైశ్యుల్ ॥ ............................ ......*

* గద్యము - *

* ఇది శ్రీసరస్వతీవిలాసచరణసరసీరుహనిష్యందమకరందబిందుసం *
* దోహమధురధురీణమధుకరాయమానమానససరసకవితావిలాస *
* శ్రీభాస్కరాచార్యనామధేయప్రణీతంబైనవైశ్యపురాణంబను *
* మహాప్రబంధంబునందుదేవతాప్రార్థనంబును-మహాక *
* వివర్ణనంబును-వైశ్యఋషులుసాలంకాయనఋషి*
*నడుగుటయుం- బురాణలక్షణంబును।సృష్టినిర్మా*
*ణంబును।మహాదేవమహిమప్రస్తుతులువర్ణనం*
*చుటయు।యుగప్రమాణంబును కాలనిర్ణ*
*యంబును।వైశ్యరుషులసంభవంబు*
* ననునుకథలంగలవి ప్రథమా *
*****శ్వాసము-*****



శ్రీ

శ్రీమహాగణాధిపతయేనమః

## వైశ్యపురాణము * ద్వితీయాశ్వాసము



శ్రీరాజరాజవిలసదాగారులు దుగ్ధాంబురాశిగంభీరులుజం । భారి
సమభోగవిభులు । నారీమన్మథులు బాలనగరప్రవరుల్ ॥ ౧॥ ఆకర్ణింపుండని
సాలంకాయనమునీంద్రుండు వైశ్యఋషులకిట్లనియె ॥ ౨ ॥ చ ॥ మొలమిన్న
గ్మజావతిస్థిణోరుతలమస్త్యైఖ్యాటపద్మల్గురు । జ్వాలమూర్తుల్మనుజోత్తము
ల్తదితరస్థానోరువందందరై । జలజాతుల్వరవర్ణి సీమంతులతిస్వచ్ఛాంగ
శృంగారిణుల్కులస్త్రీసత్స్వతలుద్భవించిరెలమిన్ గోత్రావళీరత్నకై ॥ ౩ ॥
ఉ॥ ధాతయుబుత్రమోహజనిత ప్రియభంగులజాతకర్మముల్చాతురినా
మధేయములుచౌళవిధానములున్ ఘటించివిఖ్యాతశుభోపనీతుల గుటారశి
గౌరవసీతసుజ్ఞతా । ధీతసమస్తవేదులుగధీరులుగాంగరుణించియుంతటన్ ॥ ౪ ॥
క ॥ ఆద్యానుక్రమగతినన్ * సద్యస్స్థితివర్తమానవనితాతతులన్ । విద్యానిధు
లను వైశ్యుల । కుద్యోగత బెండ్లిఁజేసె సుత్యంతగన్ ॥ ౫ ॥ గీ ॥ అత్తతజటుదన
శోత్తర । సప్తశతఖ్యాతగోత్రజాపతులకుసం । సుప్తిగవిలసిల్లెను నాదిత్తవ్య
వహారసరణిధీరత దెల్పెన్ ॥ ౬ ॥ క ॥ వరకృషిగోరక్షణములు । నిరతముగాధన
ము వృద్ధినిసడించినదన్ । కరుణయువితరణగుణమును । సరసీరుహగర్భుండొ
సగెసంతోషమునన్ ॥ ౭ ॥ మరియుయజనాధ్యయనదానకర్మత్రయంబును
గర్భాధానపుంసవనసీమంతనామకరణాన్నప్రాశనచౌలోపనయనవి
వాహాదిషోడశకర్మమర్మజ్ఞానంబును దేవబ్రాహ్మణగోటాంకవననిక్షేప
ప్రతిష్ఠాదిసప్తసంతానమహాధర్మంబులును । నణుమాత్రపదార్థసంరక్షణ
ప్రవర్ధనసమస్తకౌశలంబును । మహావ్యవహారక్రియాగాంభీర్యధైర్యంబు

లును।నిఖిలపట్టణాంకణప్రచారప్రచురసమస్తవిస్ఫారితప్రభావంబును।వై
శ్యాన్వయయోగ్యంబులగుధనకనకమణివస్తువాహనాదివివిధాధికవరి
ష్ఠాధికారిత్వంబును*యుపదేశించిభూలోకంబునఁబ్రతిష్ఠించినా ॥౮॥సీస
ము॥బ్రహ్మోక్షతలమోఁకిభార్యాసమేతులైభూమండలంబునఁబూర్ణముగను
సకలజనానందసంపదైశ్వర్యంబులవ్యాహతఖ్యాతినతిశయిల్ల।వివిధనీతివి
శేషవిద్యాప్రభావంబులాఁగాఢవాక్ప్రౌఢులచ్చుపడగ।సప్తసంతానాది
చారుధర్మంబులుసత్కీర్తిమహితులఁజతురముగను।వెలయనొనరించిబహు
మానవిపిన్నగతుల।సత్యసంధాధురీణులైసర్వమాన్యు।లగుచుసౌభాగ్యభో
గవిహారులగుచు।నధికయౌవనసౌఖ్యంబులనుభవించి*చ॥కొడుకులుకూఁతు
లుఁ సఖులుకూఁగిమిబాంధవులాప్తవర్గముఁ।నడరగనెల్లవేళలనిజాజ్ఞవహిం
చివశప్రదీపులై।చిడిముడిపాటులేకతమసేవయొనర్పఁగసంపదాఢ్యులై।
పడిగలనాడెచిత్తమునశివస్థిరభక్తిఁగూర్పఁగాఁదగుఁ॥౧౦॥చ॥తనుజులుమ
ఱఁదంబునపదంపడిభార్యలుబుద్ధిసెప్పనె।ననుచువిభక్తులైమిగులవేస
రికష్టపుకూడువెట్టగా।మనుగుచునాత్మఁపత్నితనుమూతులుముంప్పనశక్త
కార్యులై।చెనటితనంబునఁబడక శేషవిభూషణుఁగొల్చుటొప్పగుఁ॥౧౧॥
క॥జరయఱయపాపరూపిణి।జరయుట్టిబలాఢ్యునైనజనహీనమనిగా।ఖరజేయు
ఁగానఁదలఁపుఁ।హరచరణాంబుజములంమనలరింపఁదగుఁ॥౧౨॥గీ॥అనుచు
నిశ్చయించియంగనాసహితులై।కణకకమలగర్భుఁకడకునేగి।యతనిపాద
ములకునతిభక్తితో(మ్రొ)క్కి।విన్నవించిరధికవినయమెసఁగా॥౧౩॥క॥శరణ
ముకమలాసననీ।చరణముఁగోకనుచుమిమ్ము సమ్మతిఁగోరన్।వరగురుమతిపని
వింటిమి-పగమఱ్ఱపాశివునిగొలుచుపథమెట్లనినన్॥౧౪॥క॥విని బ్రహ్మో దేవు
డిట్లను-ఘనునస్వరమేశుఁదలవగనుమీతరమా- వనజోదరాదులైనను- మన
ములదలపోయఁగానిమహిమలవానిన్॥౧౫॥క॥ఐనను నిజవరభక్తాధీనుండ
గుగానమీకుఁద్రినయనుడచల।ధ్యానాస్పదుఁడగుభక్తిం। బూనిమహాముని
ఁసేవపుణ్యాత్మకులై॥౧౬॥గీ॥మంత్రవిధులదెలిసిమహితాత్మవంతులై।సురు

కటాక్షభంగికొమరుమిగిలి। ఘనతపస్సమృద్ధిఁ గ్గనవచ్చు శివుకృప। ననిసన్నుల కా
కయచును మ్రొక్కి ॥౧౭॥ వ॥ బ్రహ్మజ్ఞానవిశేషముం గైకొని యమ్మహాత్ముని
కుసాష్టాంగనమస్కారంబు లాచరించి తదాజ్ఞావిశేషంబున ॥౧౮॥ మ॥ చనిసంద
ర్శనమాచరించిరి మనస్సంపూర్ణపుణ్యాపగా। వనజోద్యన్మకరంద బిం
దులహరీవర్షప్రకర్షస్ఫురద్ఘనబృందాంతరమందమందపవనవ్యాపా
రలీలోల్లసదున్నమత్కన్యానటనాభిశోభితతపోభూమ్యాశ్రమశ్రేణులన్ ॥౧౯॥
వ॥ మఱియు నమ్మహామునీశ్వరవరతపఃప్రభావదీపితపావనాపగాసమీపస
బంధురసంధ్యామంటపంబులును సమిత్కుశఫలాహరణస్ఫుటఘటక్రీడా
రూఢమహానోకహచ్ఛాయానిషణ్ణమృగనాభిశోభితధ్యానస్థానప్రదేశం
బులును - నానామునికుమారికానికరకరకిసలయకలితకనకకలశసలిలాభి
షేకవర్ధమానపల్లవితకోరకితకుసుమితఫలితవివిధద్రుమవిశ్రాంతశుకపి
కమయూరమధుకరమిథునవిహరణనిపుణతరుణమలయపవనకించిచ్చలి
తవికచప్రసవవిసరపరిమళమిళితబహుళమహీధరగుహాగేహంబులును
మునికుమారోదితఋగ్యజుస్సామాథర్వణశిక్షాకల్పవ్యాకరణనిరుక్తచ్ఛం
దోజ్యోతిషవివిధతర్కతత్త్వజ్ఞానశాస్త్రఘోషఘుమఘుమాయమానసువ
ర్ణవర్ణోదీర్ణాభ్యర్ణపర్ణశాలాజాలస్థానంబులును నిరంతరాహు
తిగంధగంధితధూమమధుమాసపావనపవనప్రచారప్రచురతైర్థికామధ్య
దర్భాసనాసీనయమనియమాసనప్రాణాయామప్రత్యాహారధ్యానధా
రణసమాధ్యష్టాంగయోగనిరతకశ్యపాత్రిమౌద్గల్యశ్రీవత్సమార్కండేయ
గౌతమాంగీరసనారదపారాశర్యవాలఖిల్యవామదేవసుతీక్ష్ణపులస్త్యదూ
ర్వాసమాండవ్యశాండిల్యఋష్యశృంగవశిష్ఠభరద్వాజసాలంకాయనప్ర
ముఖమునిసంఘంబులం గనుంగొని వినయభక్తిపూర్వకంబుగా సాష్టాంగనమ
స్కారంబులాచరించి ముకుళితకరకమలులగుచు వారలను ద్దేశించి యిట్లనిరి
॥౨౦॥ క॥ వెలయఁగ కృతార్థులమైతిమి। సలలితముగ వైశ్యకులము సాఫల్యంబై
వెలసె సుకృతాదిగతులన్। గలిగె భవద్దర్శనంబు ఘనతరభంగిన్ ॥౨౧॥

గీ॥ సకలదురితహరము సద్భక్తిసుకృతంబు। పూర్వజన్మమహితపుణ్యఫల
ము। భావిభోగభాగ్యపరకృపాసంప్రీతి। తరము బ్రహ్మమునులదర్శనంబు
౨౪॥ వ॥ అనుచు ననేకప్రకారంబుల నమ్మహానుభావులగు మునులమనఃప్రీతిగా
వినుతించిన॥ ౨౫॥ క॥ వనితద్భాషారచనలు। మనమలరన నుగ్రహించి మన్నించి
తగన్। మునినాయకులును వైశ్యుల। ఘనముగ నాశీర్వదించి కరుణ దలిర్పన్॥
౨౬॥ క॥ ఏ కారణమిట్లేగితి। రే కాలము పుణ్యవిధుల కిరవగు పురుషుల్। మీ
రాగమఫలభాగ్యము। చేకురు పరమార్థమనిన చెప్పిరి భక్తిన్॥ ౨౭॥ శా॥
భూలోకంబతిగర్వదుర్వహమనా భూతవ్యథాత్మీయమదు। ర్మేలావాలము రో
గసంశయభరోత్సేదంబులై భూన్యకృ। జ్జాలాభీలము మత్సరాగ్రహమ
హాపాశబంధంబుగా। జాలిన్ బొందెడి మర్త్యకోటికి శివజ్ఞానంబు సౌఖ్యం
ఖిలన్॥ ౨౮॥ వ॥ అనిన నమ్మునీశ్వరులకు వైశ్యబుధు లిట్లనిరి॥ క॥ హాలాహల
విషవర్ష। జ్వాలాభీలాభినిమిరసంభ్రమదవిష। జ్వాలాక్రందనముతువర్ష।
జాలిన శివుగొల్చుగతిం బ్రసాదింపుం డొగిన్॥ ౨౯॥ వ॥ అని విన్నవించిన ము
నివరులకుం దత్ప్రేమంబున తమ వాక్యంబుల నంగీకరించిన ప్రమోదభరితహృ
దయులై దినదినంబును వారలకు శుశ్రూషావిశేషంబు లొనరించుచు క్రమ
క్రమంబున సేవించిన వారల భక్తియు సదాచారనియమంబును పరీక్షించి సం
తోషించి వైశ్యులకు శివుండు ప్రత్యక్షంబగునట్లుగా పంచాక్షరీమంత్రంబు
పదేశించి తత్సాధనమంత్రపూజాసంతర్పణజపహోమచక్రోద్ధారణ
విధులును నవచక్రంబులును సప్తమండలంబులును దహరోత్తరరహస్యంబులు
మొదలగు శరమయోగరహస్యజ్ఞానంబులు దెలిపి నిజగురుకారుణ్యలబ్ధజ్ఞా
నసమన్వితులై యమ్మునులచే వైశ్యబుధులు పుణ్యనదీనదసత్కులమహీధ
రనైమిశారణ్యాదిపుణ్యావనస్థానంబులకుం జని విహితాష్టాంగయోగనిరతు
లై శ్రీకృష్ణమహాదేవునుపదేశించిన తపంబొనరింపదొడంగిరి॥ ౩౦॥ ఉ॥ కొందఱు
వన్యమూలములు గొందఱు వ్రాలినపర్ణసముల్। గొందఱు వాయుతో

యములు గొందఱు పక్వఫలప్రకాండముల్ । గొందరు పంచగవ్యములు గొంద
ఱు శాకములన్ భుజింపుచున్ । గొందఱు భక్తితత్పరతఁ గొందఱమందన ధీర
చిత్తులై ॥ ౩౧ ॥ క ॥ నాలుగుదిక్కులమంటలు । నాలుక లొగి గ్రాసిమండెనట
నలుసలుసన్ । దూలక రవిమండలమున । కీలించిన దృష్టిసంప్రకీర్తన మెర
యన్ ॥ ౩౨ ॥ సీ ॥ తేరిజాడగ రానితీవ్రాతపంబున పర్వతాగ్రంబునఁ బ్రతిభ
దనర * నుడుగని జడివానల డరంగ బెగడైన పెనుమ్రాకు నీడల బెండువడక *
వడివహ్నినైనను వణకించు చలిలోన నిండిన కొలఁకుల నేపుమీర * సాహారని
ద్రలు నని శంబు వర్జించి విఘ్నకారుల చేత బెగడువడక * సురుమహీరుహ
శాఖల చరణయుగము * లలర గీలించి యుగ్రతతలయు గ్రిందు * గాగ జేతులు
గ్రాలఁగ నణగి ఘోర * తపమొనర్చిరి పరమేశు దలఁచి యచట ॥ ౩౩ ॥ వ ॥
మరియు ననేకప్రకారంబుల ఘోరతపంబాచరించి విష్ణుం గానక సకలవన
పుణ్యకులపుధరస్థానంబులనుండి తపంబు సేయువారలందరుఁ గూడి విచారణక
ర్తలై యిట్లని వితర్కించిరి ॥ ౩౪ ॥ క ॥ సంతోష ప్రదుఁడగుచును * చింతింపఁడు
మనల శివుఁడు చిత్తములోనన్ * యింతే లేఁదడవు జేసెను * రొంతయు నెరు
గింపవలయు నిదిగుసువులకున్ ॥ ౩౫ ॥ .......... వ ॥ అని వైశ్యమునులం
దరు చింతాతత్పరులై కదలి మునిసంఘంబులకడకుం జని యిట్లని విన్నవించిరి - మ
హాత్ములారా మీరానతిచ్చిన విధంబున పరమరహస్యోపదేశంబున దపంబు
జేసిన పరమేశ్వరుండు గరుణింపని తెరంగెఱుంగింపుం డనిన నమ్మహామునులు
దివ్యజ్ఞానంబునం జూచి యిట్లనిరి ॥ ౩౬ ॥ క ॥ మీమీ యిష్టార్థంబులు ।
మాముందఱ ప్రతినఁ జేసమానిన యంతన్ । మీమీ నిష్ఠకు మెచ్చుచు । సామీప్య
పదంబొసంగు శంభుఁడు వేగన్ ॥ ౩౭ ॥ వ ॥ అని మరియు నిట్లనిరి ॥ ౩౮ ॥ క ॥ మీకులము
వారికెల్లను । యీ క్రియ నార్జింపకున్న నిహపరసుఖముల్ । ప్రాకటముగఁ
బ్రాపింపవు । శ్రీ కలిమియు లేకుమిగుల సిద్ధంబరయన్ ॥ ౩౯ ॥ వ ॥ అని మునీం
ద్రులానతిచ్చిననట్ల కాక -యని యంగీకరించినం దర నాశీర్వదించి మీకు పర

మేశ్వరుండుపరమకృపాయత్తచిత్తుండై వేగంబ ప్రత్యక్షంబుగావుతనని నవై
శ్యమునులుసంతోషించిపుణ్యంబులగు నిజతపస్థానంబులకు నరిగి ఘోరంబగు
తపంబాచరించిన ||౪౦||సీ|| శక్త్యాననస్థులై పాయకుండుట జేసి పెట్టెలుపుట్ట
లునిట్టలముగ । పుట్టలగోళ్లనుపుట్టినకీచకసంధిరంధ్రంబులఁ జతురముగను ।
వర్షధారలుసొచ్చి వాటమై ముఖనేత్రనాసాశ్రుతీసులనటనదాకఁ । బొ
డమినగర్భాగ్ని భుగభుగధ్వనులతో దొరగెడిమిణుగురుల్ తొంగలింప । విపు
లదిచ్చరకోలలవిధముదోఁప । మింటపుంఖానుపుంఖములంటమెరసి । కడిమి
నుడివడిఘనతారకములదాఁక । తపమొనరించిరితరుణేందుధరునిఁ గూర్చి ||
మరియు నాతపంబువలన||౪౧||క||నృషఁగొలుచునుగ్ర తపమున । జడిసె
కులగిరులు సప్తజలధులుగలఁగెఁ । కడిమినుడుగణము జెదరెను । కడువడిసు
డిగొనుచు ధరణి గడగడవణకెఁ ||౪౨||వ|| అయ్యవసరంబునం బరమేశ్వరుం
డు వైశ్యఋషులతపఃప్రభావంబునకు సంతోషించి||౪౩||క|| అందరియా
శ్రమభూముల । నందరవైశ్యులకువరదుఁడయ్యెడికొఱకు । నందరుదివి
జులుగొల్వగ । యందరికినినన్నిరూపులరుదుగనయ్యెఁ ||౪౪||సీ|| శాదూ
లచర్మంబుమార్దవచేలంబు భూతియుకస్తూరిబొలుపుమిగులఁ । చాములవా
రముల్ పక్ష్మారిఖండంబుసీమంతరేఖయుఁ జెలువుదనర । మిన్నేటినటనయు
మేలిమిశాసయు ఫణికుండలముదంతపత్రికయును । నూమ్మస్తనంబువిజృం
భితకుచమునుమహనీయ సౌందర్యమహిమలలర । నర్ధనారీశ్వ రాకృతి
యమరదాల్చి । వరగశూలాంకుశాభయవరదహస్త । సరసిజాతుండగుచు
మించిసదములమతి । చారుతేజోమయుండైనశంకరుండు||౪౫||గీ|| వెండికొం
డభంగివిశదకాంతులమించి । నంది శేసనెక్కినటనమెరయ । వరకృపామృ
తార్ద్రకరకటాక్షంబులు । భక్తవరులమీఁదఁబరగిచెలఁగ||౪౬||వ|| విఘ్నే
శ్వరనందినాథభృంగిరిటమహాకాళమహావీరభద్రకుమారచండీశ్వ రాంగ
దచారుకర్ణవీరకర్ణఘంటాకర్ణ విజయకర్ణత్రిముఖచతుర్ముఖపం
చముఖానేకముఖయేక కరద్వికరదశకరశతక. రసహస్రకర సిహ్మ ముఖా

ద్యనేకప్రమథగణసమేతుండై హరిబ్రహ్మేంద్రప్రముఖదిక్పాలక-సురగణ
పరివృతుండై త్రయస్త్రింశత్కోటిదేవతాగణంబులు గొలువ వైశ్యఋషు
లకుం బ్రత్యక్షంబైన వల్మీకంబులనుండి వెలువడి పరమానందకందళితహృద
యారవిందులగుచు సవినయంబుగా సాష్టాంగనమస్కా-రంబులాచరించి కర
కమలంబులు ముకుళించి నిటలతటంబులం జేర్చి యిట్లని వినుతించిరి ౪౭॥ దండ
కము॥ శ్రీమన్మహాదేవదేవాధినాథా భవానీమనోనాథ లోకత్రయాధార
సర్వేశ్వరా శర్వ సర్వజ్ఞ సర్వాత్మకా సన్నిధి కల్పత్ర భాభర్వదోగర్వదు
ర్వారసర్వంసహారత్నభక్తప్రియా నీమహత్వంబచింత్యంబమేయంబచోద్యం
బఘోరంబు నీపాదపద్మంబులే దైవముల్ గానగా సేతుశేషమున్న గోవిందు
డున్ బ్రహ్మదేవుండు మీయాదిమధ్యాంతశోధక్రియాబుద్ధి క్రోడంబు హం
సంబునై మేదినీమండల వ్యోమభాగంబులం జొచ్చి శోధింపగా విశ్వబాహుం
డవై విశ్వనేత్రుండవై విశ్వవక్త్రుండవై విశ్వదేహుండవై యొప్పియుం గాన
గాలేక విశ్వంబు నెల్లం బదాంగుష్ఠకోణంబునన్ ద్రొక్కనెక్కొన్న నీయొ
క్క చిత్రప్రభావంబు లేశంబునుం గానగాలేనత్యంతచింతాభరాక్రాం
తిసంక్రామితస్వాంతులై యొప్పెదం గానగాలేక - యుష్మత్కృపామేయ
మాయాంధకారంబులో బ్రుంగుడై సంగడంబేడియన్యోన్యరూపంబులన్
గానగాలేక శంభో నమశ్శంకరాయాతు యాయ స్వభూవిశ్వకర్త్రే నమో
విశ్వరూపాయ హర్త్రే నమో విశ్వహర్త్రే నమో విశ్వవిశ్వంభరాయ ప్ర
సిద్ధాయ ప్రభాభవ్యనవ్యస్వరూపాయ భీమాయ తుభ్యం నమః ఘః కాలకాలా
య కామప్రకామాయ కారుణ్యరూపాయ తుభ్యం నమో ధూర్జటే నీలకం
ఠాశ్రయారక్షణాక్షీణకల్యాణమూర్తే నమో యన్న ప్రత్యక్షదేవుండ
వై కాచి రక్షింపగా నేతునీవేఖ వస్తత్వమే వ్వాడు గాన సమర్థుండు మ్రు
త్యుంజయా నీప్రసాదంబునన్ జన్మసాఫల్యముయ్యెక్ ధరావాయుతోయా
గ్నిసోమార్క వైశ్వానరాష్టాత్మమూర్తే త్రైలోక్యపాపాంప్రనాగేంద్రభూషా

జ్జ్యేలామామకాభీష్టమిష్టార్థకాసిద్ధుల్ బ్రసాదించిరక్షింపు శ్రీవిశ్వనాథానమ
స్తేనమస్తేనమస్తేనమః ॥క॥ అనిసంస్తుతించిపలికిన | విని సంతోషించి శివుఁడువి
శ్వాధీశుం | డను నెద్దియభీష్టముమీ | కెనయంగాకోరుడిత్తునేవరమైనన్ ॥౧౯॥
వ॥ అనిసకలలోకాధీశ్వరుండైనయీశ్వరుండానతిచ్చినపరమానందకందళి
తహృదయారవిందులైయవైశ్య మునులందరుపునఃపునఃప్రణామంబులా
చరించినిటలతటఘటితకరకమలులైయిట్లనిరి ॥౨౦॥ క॥ మాకులమువారికెల్లను
మీకరుణయగలుగనిమ్ము నిత్యస్థానం | బా కైలాసనివాసము | జేకొనుమాపిన్న
పంబులీ ఘుమ్మెయ్యభవా ॥౨౧॥ వ॥ అనిననప్పుమహాదేవుండవుగాకయనిభక్తవ
త్సలుండగుట యంగీకరించి పుష్పకంబాకర్షించెనంత ॥౨౨॥ సీ॥
ఖచితమహారత్న కనకసౌధంబులు ధగధగద్ధగయనిదనరి వెలుగ | దివ్య భూష
ణఘోషదివ్యకాంతానందఘనలసత్కింకిణధ్వనులు జెలగ | ఘణఘణధ్వనిజు
ష్టఘంటోరుదుందుభిఘుమఘుమారావంబుఘూర్ణమగుచును | పటునటత్కా
మినీపదమంజరీమణఝుణఝుణత్కారపుంజములు మెరయ | పుష్పవర్షం
బునురియంగపుష్పకంబు | నందువైశ్యులనెల్లనునమరనిలిపి | శివుఁడుకైలాసశిఖ
రికిఁజిత్రగతులు | కొనుచువిచ్చేసెనాశ్చర్యఘోషమమర ॥౨౩॥ వ॥ అపుడువై
శ్యమునిసంఘంబులుపుత్రమిత్రకళత్రబాంధవులతో దివ్యదేహంబులు దా
ల్చియప్పరమేశ్వరునిదివ్యశ్రీపాదపద్మంబులుగొలిచి కైలాసంబునవసియిం
చిరనిపాలంకాయనమునీంద్రుండానతిచ్చినవినియవైశ్యవరులవ్వైశ్యకథా
వృత్తాంతంబుపునటయు॥ హరిహారపద్మ గర్భచరణాంబుజలోలుపచంచరీ
కములు | ఖరకరతేజులాశ్రితనికాయపయోనిధులంబికామనో | హరకరుణా
విరాజితులుయాచకపాలనకామధేనుః | భూరఘనదానబాలనగరత్రవరు
లున్విచారులిమ్మహిన్ ॥౨౪॥ మాలినీ॥ పరిభవగుణకూరుల్ భావజాకారసారు
ల్ | నవవరజనమాన్యుల్ న్యాయవిజ్ఞానధన్యుల్ | నరనుతపటుకీర్తుల్ నవ్య
గంభీరమూర్తుల్ | పరహితసమవశ్యుల్ వణిక్రాచారవైశ్యుల్ ॥౨౫॥

——***§ గద్య §***——

*ఇది శ్రీసరస్వతీవిలాసచరణసరసీరుహనిష్యందమకరందసందోహమ*

*ధురంధురీణశుభకరాయమానమానససరసకవితావిలాసభాస్క*

*రాచార్యనామధేయప్రణీతంబైనవైశ్యపురాణంబనుమహా*

*ప్రబంధంబునందుబ్రహ్మదక్షిణవామోరువులనే నూటవ*

*మనలుగురుసతీయుక్తులై వైశ్యులుజనించుటయు - వా*

*రలు! బ్రహ్మపంపునతపంబునకునరుగుటయు - ము*

*నిదర్శనంబును - పంచాక్షరీమంత్రోపదే*

*శంబును - యీశ్వరానుగ్రహంబు*

*నుకైలాసంబున కరుగుటయును*

*నుకథలంగలదిద్వితీయా*

**శ్వాసము - **

——*——









* శ్రీరస్తు *

## వైశ్యపురాణము - తృతీయాశ్వాసము



* శ్రీరజితాద్రీశపదాంభోరుహమదచంచరీకముఖ్యులు కరుణావారి
భోరాసులార్యులనఘులు । నారాయణనుతులు బాలనగర ప్రాభుల్ ॥ ౧ ॥
వ ॥ ఏకచిత్తంబున నాకర్ణింపుండని సాలంకాయనమునీశ్వరుండు వైశ్య
ఋషులకిట్లనియె నట్లు మహాదేవుండు వారలకై లాసంబున నుండుమనినయ
నంతరంబ వైశ్యఋషులద్దేవుని దివ్యచరణధ్యానపరాయణులగుచు మందా
రవనసమూహమధ్యస్థలంబులను చంద్రకాంతశిలానికేతనస్థానంబులను ।
సురాపగానికటతటసైకతస్థలంబులను - నిరంకుశవృత్తిం జరింపుచు దేవము
నిగంధర్వసిద్ధవిద్యాధరాదిమహాప్రమథవరులతోడ సఖ్యంబులొనర్చు
చు పుత్రపౌత్రకళత్రయుతులై బహుసహస్రాబ్దంబులున్నయనంతరంబ
యొక్కనాడు ॥ ౨ ॥ సీ ॥ చిత్రకంఠుండనచెలువారగంధర్వుండు భవుని సేవిం
పనరుగుచుండి । సోమకాంతాఖ్య వైశ్యునిపుత్రిం ద్రిభువనకీర్తనీయ చరి
త్రకీర్తి కన్య । కథమునగనుగొని పంచాస్త్రపంచాస్త్రనిర్భిన్నహృదయు
డై నెవ్వడొక్క । తనుకంబుతోడనత్తరళాక్షివెంట నేథామంబునకు నేగి తా
నిల్లి । దండ్రులను గాంచి తనయీప్సితంబు జెప్పి । కన్యనిమ్మన్న వారు నాఖ
చరవరుని । యాత్మనొప్పింపజాలక యాప్తులకును । జెప్పి యిచ్చెదమని యాశే
ద్రిప్పిరతని ॥ ౩ ॥ గీ ॥ ఇట్లు ద్రిప్పి త్రిప్పి నేదియ వైశ్యులొండు । ఖచరసాధు
జాధికన్యనియ్య । కూడదరుగు మునివగురుతర క్రోధరక్తాక్షుడగుచునప్పు
డాతడనియె ॥ ౪ ॥ గీ ॥ ఓరి పాపకర్మ యోరుజాధమ నీవు । నిన్ను గూడు బా
ధునిచయములను । కాలుదువిక నేగి కన్యతో నొక్కరా । జన్యుకతనననుచు శా
పమిచ్చె ॥ ౫ ॥ క ॥ శాపంబునొందియాతడు * కోపాటోపమున నోరిగుణ

హీనము రా*లాపములకనికివీవా*భూపాలుఁడవైజనించుభూలోకమునకా
౬॥ వ॥ అనిన నవ్వైశ్యవరుండు మఱియు నిట్లనియె యొకకన్యక నిమిత్తంబున
భూలోకంబున రాజవై పుట్టి వైశ్యుల శాపంబున పొలియుమని బ్రతిశాపంబి
చ్చె నంతఁ గొంతకాలంబున కుంబరమేశ్వరుండు గౌరీకల్యాణంబవధరించె నాస
మయంబున ॥౭॥ ఉ॥ శ్రీనుతవజ్రరత్నమణిచిత్రసువస్తువులెల్ల నాదిగా*
కానుకలర్థిఁ దెచ్చి శుభకారణమై భవమొప్పఁజేయుచున్ * మానుగఁగో
ల్చియున్న జనవాన్యుల నొక్కక లోకవాసులన్ *పూనిక తాతఁదృష్టిప
రిపూర్ణులఁ జేసియనంతరంబునన్ ॥ ౮ ॥ చ॥ నిరతము సేవఁజేయుచును నిశ్చ
లుఁడైన కుబేరుఁ జూచియా* వరుసను మర్త్యలోకముల వారును పాయనదత్త
హస్తులై * కరమనురక్తిఁ గొల్చి నిజకార్యఫలాధ్యతఁ బొందివేచనన్ * ధరణి
జనంబులిట్లు భుజదర్పమెలర్పఁగ రారదేటికో ॥ ౯ ॥ వ॥ అనియానతిచ్చిన కు
బేరుండిట్లనియె ॥ క॥ సుస్థిర కాంచన వాహన* వరమణి వాసోవిశేష వస్తువి
శేషా*స్థగమతిమంతులు వైశ్యులు *ధరణిస్థలినెంచు లేరు తరుణేందుధరా॥
గీ॥ మిమ్ము మెచ్చఁగొల్చి మీపాదపద్మంబు* లమర సేవజేసి యమరులగుచు
ఘనవచస్సమృద్ధికై లాసవాసులై * యున్నవారు వైశ్యులు విన లేరు॥ ౧౦॥
వ॥ అని విన్నవించిన నప్పరమేశ్వరుండు సజవివాహోచిత సమస్త వస్తు
పరికరంబులొనఁగూర్చుచున్న యవ్వైశ్యముఖ్యులం జూచి యథోచితంబుగా
ననుగ్రహించినా నామణివాహనవస్తువితానపరిపూర్ణ సౌఖ్యంబై భూలో
కంబున్నది గావున మీరచ్చటికిఁ జని సుఖంబుండవలయునని యానతిచ్చి నా
౧౧॥ గీ॥ అట్లు కాకయమచున నత్యంత భక్తితో* నలరి వైశ్యవర్యులర్థితోడ*
శంభు పాదములకు సాష్టాంగ నతులై * విన్నవించిరధిక వినయ మెసఁగ॥ ౧౨॥
చ॥ తరుణశశాంకశేఖర విధాతృముఖామర రాజరాజకిన్ * దిరముగఁ జేరరా
సిభవదీయపదాంబుజయుగ్మసేవమా* కిరవుగ నిచ్చినాఁడవు మహేశ్వర ధా
త్రిఁ జరింపఁ జేతుమా * సురతరుపుష్పగుచ్ఛములఁ జొక్కనతేటికి జిల్లెఁ డేటి
కిన్ ॥ ౧౩ ॥ వ॥ అని విన్నవించిన వైశ్యముఖ్యులకంబికా మనోహరుండును

గి వారలకిట్లనిరి-మున్ను మీకరవిందభవుండు చెప్పినరహస్య ప్రకారంబున
సుగంధపూర్ణనిశావంబునను వచ్చి వసించు మేలగు - మదీయస్థానంబున నుండు
టం జేసి మీ వెంబడివచ్చిన నగరేశ్వరుండనైయుండెద -నింక నందియంబులే
దనన్నుం డవిమఱచియునిట్లనియె॥౧౪॥గీ॥భక్తులెచట నున్న బద్ధానురక్తితో । న
చట మేమునుండు మహారమాంబ । గాన మీరు ధరకుం గను నీయగతి నేగి । మ
హితభక్తియుక్తిమనుండు మీరలు॥౧౫॥సీ॥భూమండలంబున బుణ్యాలయంబైన
శుద్ధదేశంబున శోంపుదనర । పురముల నిర్మించి వరరత్న హాటక వివిధ గే
హంబుల విశ్రమించి। వాణిజ్య కృషి వృద్ధి వర్య గోరక్షణ జీవన భంగులం జె
న్నుమిగిలి । సంతతవిశ్రాణసంపత్ప్రసిద్ధావాసబహు వైభవంబులం బ్రబలుల
గుచు । నమ్ము భక్తిని సేవించి మనుడు మీరు। నగరమను పేర ధాత్రిలో నెగడు
చెలగి । మేము నగరేశ్వరఖ్యాతి మించి మిమ్ము॥ ఘనత పాలింతుమే వేళం
గరుణతోడ॥౧౬॥వ॥అనుచు నప్పరమేశ్వరుండు పుణ్యస్థాననిర్ణయంబునకుం
బరమేష్ఠియు-సకలవస్తునిర్మాణకర్తృంబునకు విశ్వకర్మయు -నిఖిలధర్మవ్య
వహారార్థంబునకు ధనదుండును -మీకు సహాయంబగునట్లు చేసెదము-మీరు
నందికేశ్వరుకర్ణరంధ్రమార్గంబున బ్రవేశించి వెడలి భూలోకంబున కుం

❀ వైశ్యవరులు భూలోకంబునకరుగుదెంచుట-❀

జనుండని యానతిచ్చిన వైశ్యవరులప్పుడు॥౧౭॥క॥గోకర్ణరంధ్రపథమున ।
గోకర్ణాభరణునాజ్ఞకు వలయమునకుర్ణ । గోకర్ణజులటు గదలిరి । గో
కర్ణేశుండు బ్రహ్మ హర్మ్మిణా బలుకగ ॥౧౮॥గీ॥సీవు నిత్యమహిమ నిపుణత్వ
మున మించి। విశ్వకర్మ ధనదవిభులు గొలువ। బుష్పకంబు నెక్కి పోలుపొంద
వైశ్యులు। భూమికిని గొనుచు నుమ్మబుధులు బోగడ॥౧౯॥వ॥అనిన బ్రహ్మదేవుండు
మహాప్రసాదంబని తదాజ్ఞాపిశేషంబున॥౨౦॥సీ॥ మహిత హాటక రత్నమహ
నీయ కుట్టిమ ప్రాకారతోరణ ప్రబలమగుచు । వజ్రగోమేధిక వైడూర్య మణి
నీలముక్తాఫలశ్రీసమూహమగుచు। వివిధాద్భుతాపాదిని పుల వాతాయనఘ
నకుటీ సౌందర్యకలితమగుచు । సంగీతశృంగార సంగర్భ గోజ్జ్వల కాంచనమ

యరత్న కలితమగుచు। మహిమ చేనించి దేదీప్యమానమగుచు। నున్న పుష్ప
కుంతన్నయారుజులను। నిలుపుకొని వచ్చి ధాత్రికి నీరజాత। భవుఁడు తత్తనుఁగా

—✳ పర్వతద్వీపనదీనదవిస్తారవర్ణనము.✳—

యనునర్థపతియా గొలువ॥ ౨౧॥ మ॥ ఇలలోనేబదియారు దేశములలోనే
పారునంధ్రస్థలిఁ। జెలువొందున్న వఖండసారముమహా శ్రీగౌతమీవా
హినీ। ఫలితానేకపదార్థభూమిబరగుఁ బ్రాగ్వారిభాగంబునన్। జలధి
ప్రాంతమునందు నెక్కు సరసీసారంబుతీరంబునన్ ॥౨౨॥ వ॥ పుష్పకంబుడిగ్గి
భారతీవల్లభుండును-విశ్వకర్మయు-కుబేరుండును-వైశ్యసంఘంబులును నత్యం
తకుతూహలస్వాంతచిత్తులైపదార్వన్నె పశిండి రెక్కలచొక్కంబులైబిస
కిసలయాస్థలీరభసంబులగు హంసంబులు-శర్మిణీకుచద్వయోపాయంబులగు
చక్రవాకంబులును-మహాజలకరకరంబులగు మకరంబులును- పరిభ్రమణవి
భ్రాజితచ్ఛవిజీవంబులగు రాజీవంబులుం గలిగి జెవులకింపగుచవులుగావిం
పనింపొదవునక్కొలనివలన వివిధాశ్చర్యంబులు గనుఁగొనుచు తన్మధ్యమస్థ
లంబున ॥౨౩॥ చ॥ కనులిని నేక నాళమును గాంచనదీధితులుల్లసిల్లుచున్ । విమ
లములైనఁబుష్పములు వేట్క త్రయంబటుగాన వచ్చినన్ । దమకమునొందిచి
త్రనునిత ద్వాణిగన్వయనాథులుబ్బునన్ । గమలజ యీవిధంబయిన కారణమే
మిది యానతీదగుఁ ॥౨౪॥ వ॥ అనిపరమేష్ఠి మీపితామహుండడిగెనని నవిని
యబ్బాలనగరంబులు సాలంకాయనమహామునీంద్రునకిట్లనిరి- మహాత్మాయి
మ్మహాప్రదంబే మహీశ్వరతపఃప్రభావంబుననగాధోదకంబును - నతివిస్తీ
ర్ణంబును-నత్యద్భుతంబునునయ్యె.నదియునుంగాక మాపూర్వులు కైలాసం
బుననుండి భూలోకంబునకు వచ్చిరని యానతిచ్చితిరి-కైలాసంబులెన్ని -ఏయే
పుణ్యభూధరంబులుగనుంగొనిరి-భాగీరథీ ప్రవాహంబులెన్ని- నగంబులలో
నేనగంబునకు పర్వతరాజనామధేయంబు గలిగెనీసందేహంబానతీవలయు
ననియడిగిన వారలకమ్మునివరుండు చెప్పఁదొడంగె- భూలోకంబునకు ముప్ప
దిరెండుకోట్లు యోజనంబుల పొడవు పరాత్పరుఁడగు శివుండు వసియించుకై

లాసంబు-కబ్బూరనగరంబుమీదటను ద్రిమూర్తులపురంబులలోనొక్కటి
కైలాసంబు-మేరువుకువశ్చిమంబునఁగైలాసంబనబరగిననొక్కటియు -
నీతెరంగునమూడుకైలాసంబులుంగలవు-భాగీరథీనదులుసహస్రంబులుబ్రహ్మ
లోకంబుననుండిసితకేసరకుధరంబునకులంఘించియచ్చటనుండిగంధమా
ధనపర్వతంబునపయింబడియిలావృతకింపురుషవర్షంబులకైడగల్గిభద్రాశ్వ
వర్షంబునకువచ్చిహిమవత్పర్వతవిదారణంబొనరించియచ్చటమోక్షద్వా
రంబనప్రఖ్యాతిగాంచిదక్షిణముఖియై-వరుణ-అసి-సరయూయనునదులనతిక్ర
మించివచ్చియమునాసరస్వతిపుణ్యనదులంగలసిత్రివేణీసంగమంబనబరగి
యచ్చటనుండితూర్పుజలనిధినిసహస్రముఖంబులెకలసినభాగీరథీప్రవాహ
మహిమంబిదియనివినిపించినవారు నమహానందభరితులైపుణ్యకథగంబు
లానతిండనినవినుండని-చెప్పందొడంగె.తూర్పుపశ్చిమసముద్రంబులనం
టిలక్షయోజనంబులనిడుపుగలిగిసపాదలక్షకుధరంబులలో వేరువడినెగడి
నట్టిహిమవన్నగంబును-నిషధమహీంధ్రంబును-వింధ్యభూధరంబును - మా
ల్యవంతంబును-పారియాత్రంబును-గంధమాధనంబును-హేమకూటంబును
ననందగినసప్తకులపర్వతంబులు-దధిక్షీరజలనిధిమధ్యంబున-మానసోత్తరం
బనుకుధరంబుమీద-యింద్ర-అగ్ని-యమ-నైరుతి-వరుణ - వాయు కుబేర
-ఈశానపురంబులుగలవు-మేరువుకూర్ధ్వభాగంబునధోభాగంబు.నవ
మనాలుగులోకంబులునుండు-యీధరణీధరంబులలోనమేరువాధిక్యంబు
వీటియావలనన్నింటినాక్రమించినచక్రవాళపర్వతంబు గలదు- వీటిన
న్నింటియందుహిమవంతంబుప్రఖ్యాతిగాంచెననినవినియమ్మహామునిశేఖ
రునకుబాలనగరంబులిట్లనిరి- స్వామీహిమవన్నగంబునకేమినిమిత్తంబుననా
ధిక్యతగలిగెననినవారలతోనమ్మునియిట్లనియె - తుహినభూధరంబు దేవకా
ర్యంబునకుహితంబాచరించెగావునఖ్యాతివహించెననినవినియాకథయాన

——❋*హిమవత్పర్వతమహిమానువర్ణనము*❋——

తీయవలయు ననిననమ్మునివారలకిట్లనియె॥౨౫॥మ॥కలడత్యుత్తముడుత్తరక్షితి
జెసకైలాసవాసోన్నతుండఘూద్యద్గుణదేవతాత్ముఁడనునిహారాచలా

ధీశ్వరుం। డలరు ధాత్రికి మానదండమున గాన వ్యాహృతఖ్యాతిసొం। పుల
పూర్వాపరసింధుసంధుల మహోన్నతాంగుఁడై యప్పుడున్ ॥౨౬॥ క॥ అక్షు
యరత్నోత్పత్తికి। దక్షుండగు సతతసొంపు దనరఁగ హిమవం। బక్షయమగు నైంద
వకళ। లక్షణమలరుం గరంగి లఘువగు భంగిన్ ॥౨౭॥ క॥ ధరదాల్పజాలు నని
యును। గరము గయజ్ఞాంగవస్తుకారణమనియున్। బరికించి శైలరాజము। న
రుమగ యజ్ఞాంగఫలమునబ్జజుఁ డిచ్చెన్ ॥౨౮॥ మ॥ హిమవంతుండచలేశ్వరుం
డగు మహోన్నృదోన్నత ప్రౌఢిమ। సుమహత్త్వప్రతిభాసభావనుహిత స్ఫూ
ర్తిన్ ప్రతాపప్రభా। సమజాసిద్ధి విహార కంధరకుటీ సన్నౌషధీకల్పక। ప్రథ
మకాతస్థిత కామధేను కనకోద్దీప్యన్మణి శ్రేణికిన్ ॥౨౯॥ శా॥ కాంతారత్న
ము భక్తవత్సల జగత్కల్యాణి రుద్రాణివే। దాంతార్థస్మృతితత్త్వ నిశ్చితకృ
పావ్యాసంగ చిత్తాబ్జనై। కాంతస్థానమునన్ మహోవియతుఁడై యాత్మప్రజా
ప్రార్థనన్। స్వాంతుం డైనుదిలో దలంపుచుఁ దపోవర్తిష్ణుఁడై నంతటన్ ॥౩౦॥

## పార్వతీపరమేశ్వరుల తపంబునకుపుట

క॥ లీల హిమగిరినాయకు। పాలికి కృశాంగ్గి పాలపాపయవోలెన్। మైత్రే
శవారాశిని వీ। నాల సగతితోఁ బ్రసన్న యమ్మేనక కున్ ॥౩౧॥ వ॥ అంతన
ప్పార్వతీయు లబ్ధోదయమైన చంద్రరేఖయుంబోలె దినదిన ప్రవర్ధమానయ
గుచు సిగ్ధసాధ్యవికాయంబులు గొలువ చెలువు మిగిలియున్న సమయంబున ॥
౩౨॥ చ॥ తొడగని భూషణంబు తనుతుష్టికి సప్మదకారణంబు సొం। పడరెడు చిత్త
జాతకలితాపమున ప్రసవంబు మేలుసం। పడమగు మాదనంబు గృతభావవి
ధానమునోజ్జభంగితోఁ। బెడగగు జవ్వనంబు దగఁ బెంపున బార్వతియుండె
నింపుగాన్ ॥౩౩॥ చ॥ వినుతవిశేషమైత్రగినవీధుల నిర్ఝరకేళి చేలుచున్। ఘు
నమృగనాభిగంధములనెమ్మి గ్రాహ్యపులు చల్లచల్లనై। దనరిన శైలరాజసుత ధా
మమహోస్థలియందు తన్నదా। గనుగొను వేడ్కనెంచెశిశిరంబుసమక్రమవిక్ర
మోన్నతిన్ ॥౩౪॥ వ॥ తదనంతరంబ పరమజ్ఞానవంతుండగు హిమవంతుండు
సతీసమేతయగు నప్పార్వతిని పరమేశ్వరునకు శుశ్రూషావిశేషంబులొనరిం
పనియోగించిన నంతోష్టితస్వాంతయగుచున నేకప్రకారభయభక్తి పూ

దయారవిందమై యమ్మహాదేవునకు శుశ్రూషావిశేషంబు లొనరించుచున్న
సమయంబున ॥ ౩౫ ॥ ఉ॥ తారకదానవుండు భుజదర్పమెలర్ప జగత్త్రయం
బు సంహారము సేయబూనిన భయంబున భెగ్గిలి యింద్రముఖ్యులున్ దారకు
లబ్జసంభవుని డగ్గరి మ్రొక్కుచు సంస్తుతించి నిస్తారనిజాగ్రబాధలు పదంపడి
డి సర్వము విన్నవించినన్ ॥ ౩౬ ॥ వ॥ విని పద్మాసనుండు సుపద్మాసనోపహారు
నిమనంబున నిలుపుకొని యాదానవుండు మహేశ్వరుని చేతం గాని హతుండు గా
డని దివ్యదృష్టి నెరింగి వారలకిట్లనియె ॥ ౩౭ ॥ క॥ హరునకు శైలతనూజకుం బ
రువడి జన్మించు నతని బాహాటోపస్ఫురణ తారకుడణగును । మరు చేత
ద్యోగవిధము మానుగ గల్గున్ ॥ ౩౮ ॥ ... ... ... ... *
వ ॥ అనిన కమలగర్భుం డానతిచ్చిన పనిని సర్వదేవతాసహితుండై యాఖండ
లుండు నిజపురంబునకరుగుదెంచి యప్సరోగణంబులు గొలువ సుఖాసీనుండై
పేరోలగంబుండి సురాచార్యు రావించి యతనికిం దద్వృత్తాంతం బెఱింగించిన

❀ మదనుడింద్రు పంపున శివుని తపోవిఘ్నము చేయుటకై వచ్చుట ❀

వాండై సుమశరు రావించిన ॥ ౩౯ ॥ సీ॥ విలుకరథము నెక్కి చెఱకువింటి
ప్ప । శరధి నందిలంగ పరసగతులు । రతివసంతులలరరభసంబు సొంపున । మనసి
జుండు వచ్చె మహిమ మెరయ ॥ ౪౦ ॥ క॥ వచ్చిన సురపతి గనుగొని । యచ్చ
పుష్పవతోడం జూచి యర్థాసనమిా । వచ్చిన మ్రొక్కుదునతండా । చెచ్చెర
నే కాంతమాడ చేరుచు పలికెన్ ॥ ౪౧ ॥ మ ॥ త్రిదశాధీశ్వర జంభభంజన
భవద్దివ్యత్పదాంభోజముల్ । ముదమందగను గొంటినంధితకృపాముఖ్యుం
డనై మించితిన్ । మదినూహించిన కార్య మెద్దినను నేమాటన్ దలంబయ్యె
న్నో । నిధి కొల్పక బనివింటి సేతునిక నేనేయానతై నదగన్ ॥ ౪౨ ॥ క ॥ నీపద
ముగోరితి మెవ్వడు । తాపసుడై నియతభంగి తపమొనరించున్ । కోపప్రస్ఫురి
తాధర । కోపనులం బట్టి వారి క్రొవ్వడగింతున్ ॥ ౪౩ ॥ మ॥ తనుమిానత్యక్త
పావిశేషమహిమా ధన్యుండనా కెప్పుడీ । జగతిన్ పాటిసంతుండొక్క సు
ఖుండున్ జాలున్ సహాయంబుగా । నొగిపుష్ప స్త్రములిక్షుచాపమున నే

ర్ణజృంభణగా గూర్చవే। తెగిత్రూలింతుపినాకితాల్మి యునునాద్రితపుల్ ప్ర
కాశింపగా ॥ ౪౪॥ క ॥ అను నామన్మథుపలుకులు । వినిమనమున సంతసిల్లి
వేగనుమాయా। త్తునిగాన శ్వరమేశ్వరు।నవిసాధింపుము మదర్థమనిహరి
బలుకగా ॥ ౪౫ ॥ గీ॥ అట్లుగాక యనుచు నాజ్ఞావిశేషంబు। శిరమునందు దాల్చి
చెలువుడనరు । గణగికొంత మేర గినుకతోడ జనచన । మతి గలంగుచు
రతిమదనుకనియె ॥ ౪౬ ॥ శా॥ జిష్ణుండానతియిచ్చె నంచుమదనాచింతిం(సక్తి
శ్లేగినః। విష్ణుప్రీతియుగా మధుప్రశరముల్ త్ర్యేళాగ్నిభిత్రూతివ । ధిష్ణుం
డైనమహేశునొంపగలవాధీశక్తినూహించితే। నుష్ణీషంబునగట్టవచ్చు నెమ
నవ్వ్యాళోగ్ర వేదండముల్ ॥ ౪౭ ॥ వ॥ అనియనేకభంగుల వాచాకౌశల్యం
బున మరుజయంబుగోరిన నయంబుగా బల్కిన నారతిపలుకులు చులుకనగాం
దలంచికినుకబొడమిన మనంబున వినక తనపతి కార్యంబు నిశ్చయంబుగా నవ
లంబింపవలయునని యొట్టకేలకు నొడంబడపలికి వసంతుం జూచి మనబలంబుల
సన్నాహంబొనరించి మకరస్యందనంబతిత్వరితగతిం దెమ్మనినన ట్ల జేయుదున
తండువిజృంభించు సమయంబున ॥ ౪౮ ॥ మ॥ పగిలెన్ దాపసధైర్య దుర్గ
ములుకంపంబందె పాంథావళుల్ । పగులన్ దూలెవియోగినీజనమనోవర్ధి
ష్ణువర్గంబు వే।జిగురెత్తె హిమశైలనాయకవని శ్రేణీతతుల్ మిక్కిలిన్
దిగులొందెన్ జెదరెన్ గలంగెతగతన్వీపూరుషప్రాంతముల్ ॥ ౪౯ ॥ వ॥
అనిసాలంకాయనముని యానతిచ్చిన తద్వృత్తాంతం బెట్లయ్యెనని వైశ్య
ఋషులడుగుటయు ॥ ౫౦ ॥ ఉ ॥ సామజవైరివిక్రములు సంపదుదంచిత
రాజరాడ్గృహ । శ్రీ మహిమాభిరామధనశీలురు పండితవర్గపాలకుల్ ।
స్వామిజనార్దనాంఘ్రిపదపారసహత్తసుధువ్రతంబులా । శాసమానీయ
కీర్తిఘనులయ్యలు వైశ్యవరేణ్యులిమ్మహిన్ ॥ *మాలిని॥ మధురమృదుల
వాచామంజుల శ్రీవిచారు । ల్సుభనుతగుణశీలు । ల్ప్రాణసంపత్ప్రకాశు । ల్మధు
రిపుపదభక్తు । ల్మంగళాచారసక్తు । ల్విధుమచిదరహాసు ల్వైద్య పెన్గొండ
వాసుల్ ।..................................*

❁ గద్య ❁

❁ ఇది శ్రీసరస్వతీవిలాసచరణసరసీరుహమకరందనిష్యందసందోహ ❁
❁ మధురధురీణమధుకరాయమానమానసనగసకవితావిలాసశ్రీ ❁
❁ భాస్కరాచార్య నామధేయప్రణీతంబైన వైశ్యపురాణం ❁
❁ బను మహాప్రబంధంబునందు శివునికటాక్షంబున వైశ్యు ❁
❁ లు కైలాసంబున సంచరించుటయు - చిత్రకేతుండను ❁
❁ గంధర్వుండు వైశ్యుల శపించుటయు - నతని ❁
❁ కి వైశ్యులు ప్రతిశాపంబిచ్చుటయు - వై ❁
❁ శ్యులు భూలోకంబునకరుగుదెంచుట ❁
❁ యు - పర్వతద్వీపనదీనదవిస్తారంబు ❁
❁ ను - హిమశైలోత్కర్షయు - పా ❁
❁ ర్వతీపరమేశ్వరుల తపోమహి ❁
❁ మయు - తారకాసురకథనంబు ❁
❁ ను - ఇంద్రుపంపున మద ❁
❁ నుండు పరమేశు తపంబు ❁
❁ జెరుచుటకై వచ్చు ❁
❁ టయు - నను కథలం ❁
❁ గలది తృతీయా ❁
❁ శ్వాసము ॥ ❁





శ్రీరస్తు

శ్రీశారదాంబాయైనమః

## వైశ్యపురాణము - చతుర్థాశ్వాసము.

శ్రీరామామణిహృదయాంభోరుహభాసురమురారిభూనుతపా
దా! శ్రీరాజవరులలోలా! న్నారీమన్మథులు బాలనగర ప్రవరుల్ ||౧|| ఆకర్ణిం
పుడు సాలంకాయన మునీంద్రుండు వైశ్యబుధులకిట్లని చెప్పిన వారలమ్మునీం
ద్రునకిట్లనిరి ||౨|| ఆ|| అర్యానవర్యు లిట్లనుచు నామునితోడను బల్కిగానుమహా| ధై
ర్యమహార్య గంభీ|రముడగ్గరకథ జనియంత మారుడే| కార్యమొనర చెవి వేగ
వినగావలె నానతియిమ్మటన్న చా|తుర్యము మీరబల్కెను కుతూహలవృత్తిని
తే నెలొల్కగా ||౩|| క|| వినుడని పల్కె సమారుం|డనుమానము మనము
లోననత్యద్భుతమై| పెను చమత్కారి గొనగా| జనె గౌరీభర్తలున్న చక్కి
కి పెలుచగ ||౪|| ఉ|| పృథుతపత్రసత్వవనవీధిగమంగొనె భగన్దేవతా|
రుద్రమవేదికాభయదమూర్తిగ రాజిన చమత్కారమునిగ| శాద్రభుజంగరా
డ్వలయరమాకపర్దిత్రినేత్రశోభితుగ| భద్రసముద్రయోగజయభాస్వ
రముదున్నినాదిరుద్రుని ||౫|| వ|| అంత నక్కంతుండు సంతోషితస్వాంతుం
డుగాక బిట్టులికివడిన ట్టేటబుట్టి ముసింగిన భంగి నిట్టిట్టు తొలంగ రాకకట్టెమ
టనున్న ముక్కంటి కిచ్చక్కని చాయనుండ కోవకనోసరియుల్లంబుర్వ్విల్లన
కరపల్లవంబులుర్ఘుల్లనై పొంపాదవుపాదరిల్లడయీరంబులదూరి సేవచేరు
సమయంబునసంభికయుపం దినవేడ్కగలముదంబునత్యం బకునకలబుడం
బులనభిరామంబగు దామంబు సమయంబున ||౬|| క|| ఆసంధునపుష్పా
స్త్రము| వేసూటిగ నాటచెరకువింటను దంటై| భాసురగతి శివుధైర్యము నా
శించి మనోజుండేసెనద్భుతభంగిగ ||౭|| అశ్వాసము ॥ శివుడు గిరిజ నోము

జెలువంబుదగఁ జూచె। శివుని శివయుఁ జూడ శిగ్గువడఁగ। హరుడునకటమున్న యా
త్మసత్వంబును దాల్మి నూఁలుకొలిపె తత్క్షణంబ॥ ౮। వ॥ శివుఁడంత తపోవిఘ్నకార

— మన్మథుఁడీశ్వరుని చేఁ దహింపఁబడుట —

ణుం బెరింగి యత్యుగ్రకోపంబున॥ లయగ్రాహి॥ ఫాలశిఖిలోచనపుజ్వాలలురు
యంబున విశాలముగ మిణుగురులు రాలి దివి గ్రాలఁ। తీలపడి తొట్టిలయకాల
పుమహోపిడుఁగు వ్రేలిపడి తాఁ సుగతిఁ జాలి తను దాకఁ। కాలె మరుఁడంతట నెకో
లుపడి దేవతలు కాలగళ కాలహర చాలు శరణన్నఁ। తూలని యనాపదనిదూలు
చుమహాభయత దేవి రతి చుట్టుకొని సోలి ధరఁ గూలెఁ॥ ౯॥ క॥ హరుఁడున్నంతట
నందీశ్వర భృంగిరిట ప్రముఖ్య సర్వగణంబు। ల్వరజయఘోషములు లియఁగ। కర
ముగ కైలాసగిరికిఁ కణఁకఁ జనిరొగిన్ ॥ ౧౦॥ వ॥ అంతటఁ గొంతదడవున శారతీ
కాంత చింతాక్రాంతయగుచు నవసరంబున వసంతుఁడు దెలిపిన దెలిసి గద్గదస్వ
రంబున ॥ ౧౧ ॥ క॥ చిలుకలరథమును చెలువగు। నలదమ్ములు చెఱకువిల్లు నళి
నీగుణమున్। జలమున ప్రోగై క్రాఁగిన। బలువగు భస్మంబుఁ జూసి పణతుకఁ బ

— రతిదేవి ప్రలాపించుట. —

లికెన్ ॥ ౧౨॥ క॥ శైవద్రోహము జేసిన। యీవలన ప్రమాదమగుట యెరు
గుదు వెరిగా। కావని దివిజులమాటలు। భావంబున బట్టి యిట్టి పాపంబయ్యెన్॥
౧౩॥ వ॥ అనుచు ననేక ప్రకారంబుల శోకాయత్తచిత్తయై కొంతదడవునకు దీ
నాననయగుచు నమ్మహానుభావును ద్దేశించి యిట్లనియె ॥ ౧౪ ॥ క॥ కరుణాక
రశివశంకర। శరణాగతరక్షణాంక శరణము శరణం। బరుదుగ ద్రోహము
జేసితి। మరియోర్చి శమియింపు గోషమంతయుఁ దెలుచన్॥ ౧౫॥ కందము॥
హరగంగాధర కరుణాకర శైలాసేంద్ర వైరిఖండన భక్తా। గ్రగసికరక్షణ
కల్మష। హరసుర వినుతదయ బ్రోవుమ భవపురారీ। ౧౬॥ వ। అని వినుతించు
చు దుఃఖార్ణవమగ్నయై యున్న రతికి యాకాశవాణి యిట్లనియె ।౧౭।గీ॥
భగుర్గకోపభంగి పాపె పెల్ల నెంతయు। దుఃఖము డుగుమింత దూర నేల। ఘనుఁ
డు శివుఁడు వేగ మనసిజుఁ బ్రతికింప। వచ్చువాఁడు నమ్ము వనజనయన॥౧౮॥ వ॥

అనిరతీకాంతశోకంబుడిగితదేకనిష్ఠాగరిష్ఠయై శివునిరాకకెదురుజూచుచు
న్నసమయంబున ॥౧౯॥ క॥ వనజభవుఁడింద్రుండును * మనసిజసతినుతికి
మానిమెచ్చలిగొలువఁగ । గనికరమున వేవేగను । వనితామణికడకువచ్చె వాత్స
ల్యమునన్ ॥ ౨౦ ॥ వ ॥ ఇట్లువచ్చినశివుంగనుంగొని ప్రణమిల్లి దీనయగుచు
నుతియించిరతీదేవియమ్మహాత్మునకుమరియునిట్లనియె ॥ ౨౧ ॥ క ॥ యీచ
క్రవాళమధ్యధ । రాచక్రములోనభర్గా రక్షించుపతిన్ । ఖేచరులెంచగనీకు
ను । నాచంద్రార్కముగఁగీర్తియలరున్ ధాత్రిన్ ॥ ౨౨ ॥ వ॥ మరియును
శర్వా సర్వజ్ఞసర్వేశ్వరత్రిపురాంతక యనియనేకవిధంబుల స్తుతియించిన
రతీదేవినిగరుణించిశివుండిట్లనియె ॥ ౨౩ ॥ గీ॥ యోడకోడకబలయీరేడుజ
గముల । వినుతికేను మెచ్చి మునులఁగూడి । వచ్చినాడనీకునిచ్చెదనీప్రాణనా

## ॥ ఈశ్వరానుగ్రహంబున మన్మథుండు మగలజీవించుట ॥

యకునికిపగతనాయకునికి ॥ ౨౪ ॥ వ ॥ అనిమరియు ॥ చ ॥ హరుడుగృపావిశే
షమహామహాస్పదుండై సురరాజరాజవాగీశ్వరినతచిత్తవృత్తిపరిపాటిమనో
జుప్రతిష్ఠఁజేసె సాంపరుడుఁగఁ బ్రాణవంతునిగనద్భుతసత్వసమేతుగాగనిం ।
పరుమగసర్వమాన్యునిగనర్థిగఁబాలనఁజేసెఁగల్పినన్ ॥ ౨౫ ॥ గీ॥ చిలుక
రథము నెక్కి జెటకుసింగిణిబుష్ప * శరములుధరియించిచతురగతుల । రతివ
సంతులలరరమణమై వర్ధిల్ల * శివుపదాబ్జయుగము జేరి మ్రొక్కె ॥ ౨౬ ॥ వ॥
నిలిచినవారింగనుగొనికరుణాయత్తచిత్తుండై మదనునిదీర్ఘాయుష్మంతు
గాననుగ్రహించిశివుండంతర్ధానంబుజేసెనని పాలంకాయనమునివైశ్య
ఋషులకుంజెప్పనవిని వారలువందనంబులాచరించియవ్వలికథావృత్తాంతం
బెఱింగింపుఁడనినవారలకమ్మునివరుండిట్లనియె ॥ ౨౭ ॥ క॥ మదనునిసేతకు
నశ్వాడు । సదనారాతియుగలంగిమానినిఁబంబున్ । ముదమందఁగఁగైలాసము ।
సదనమునకుజేరిమిగులచలచిత్తుండై ॥ ౨౮ ॥ గీ ॥ అమ్మహాదేవుఁడారీతి
నరిగినపుడు । మంచుగుబ్బలికూతురుమదిఁగలంగి । చేలుగికురించితెరుగంగడె

లియరై రి। తెలియలేకున్నవారున జ్ఞేవిజూచి। ౨౯। వ॥ అమ్మహాదేవితలి

*...*పార్వతీదేవితపంబాచరించుట*...*

దండ్రులసను జెంచినంగనుంగొని నిజవాంఛితంబు దెరుంగించి వారియనుమ
తంబునసఖీసహితయై వనంబునకరిగి ఘోరంబగు తపంబు సేయుచున్న యెన్న
గాలంబునకునయ్యీశ్వరుండు ప్రసన్నుండై యొకపాంథరూపంబు దాల్చి॥౩౦॥
సీ॥ బంగారుతీగెలబనువుగా జెనచిన యుప్పవరిగొను యొప్పమునుంజిచుట్టి। చెం
గావినును గెంపుశృంగారముల రిన ఘట్టికాపీనంబు కటకంజుట్టి। ధగధయని
మించిపట్టమైననరినబశిడిజందెముకొంత బాగుదనర। యమిత దేజస్స్ఫూర్తి
నధికమై వెలసేనకృష్ణాజినము మేనగీలుకొనంగ। కలితరుద్రాక్షులుధరించి చె
లువుదనర। చారుదండకమండలుధారియగుచు। కపటవటువేష భావంబు ఘ
నతమెరయ। శంకరుండువచ్చె మిగులనాశ్చర్యమెసంగ॥ ౩౧॥ క॥ వచ్చినగను
గొని పార్వతి* యుచ్చపుభయభక్తులలరనఘ్యాదివిధుల్* జెచ్చెరనొన
రించిన ను* మెచ్చుచునటమిశ్రమించి మెల్లన బలికెన్ ॥౩౨॥ గీ॥ తగినంబు
రుషు హెచ్చిదపమొనరింపగ వే। తగునునీకు దపము తథ్యమరయ *తృణము
వెదకబోనరు మణులనెవెదకును* వనగజగతివిన వెయుబలనీవు॥ ౩౩ ॥ వ॥
అట్లుజెప్పినమాటకవ్వటువునకు గిరిజయిట్లనియె॥గీ॥ తపము జేయుచున్నద
గినట్టిపురుషుండు* గలుగునే సతులకు ఘనమునీంద్ర* శివుడు ప్రాణవి
భుండుశివభక్తి సులభుండు* పరగనతడు నాకు బ్రాణవిభుడు॥ ౩౪ ॥ వ॥ అని

—*పార్వతీపరమేశ్వరసంభాషణము*—

ననమ్మహాదేవుండ బికకునిట్లనియె॥గీ॥ శంభుడవ్యయుండు సంఘంబులొల్ల
డు* నిస్పృహుండు హృదయ నిశ్చలుండు* మదనసంహారుండు మహాదుగ్ర
వేత్రుండు* సాధ్యుడనగరాదు జాలుదపము॥ ౩౫ ॥ సీ॥ కులముట్టిదన
రాదు గుణవంతుడనరాదు పుట్టువెన్నడులేని భూతవిభుడు। శాంతాత్ముడన
రాదు సౌందర్యమాలేదు విషముగు త్తుకనున్న వీతవయుడు। పాణిస్థలంబున
బ్రహ్మకపాలంబుబట్టి బిచ్చంబెత్తు భాగ్యమూర్తి। కట్టగోకయు లేదు ఘనవనం
పదాఘ్యుండు మూడుకన్నులవాడు ముమకదపసి *ముసలియెద్దెక్కు జేదురు
మోము వాడు। పునుకపేసలుగళమున బూర్ణమైన। వేషధారి నీవతియన

వెరగుఁబడుచు। జనులుహాస్యంబు సేయఁగేజలజనయన ॥౩౬॥ వ ॥ అని
యనేక ప్రకారంబులనీశ్వరుదూషించిననప్పార్వతిగణాపుటంబులుమూ
సికొనినమాశ్శివాయయనుచునవ్వటువునునివారింపుఁడనుచుఁదనసఖీజను
లకుసంజ్ఞఁజేసిననతండచ్చటనుండకచని ॥౩౭॥సీ॥నందికేశ్వరునెక్కినటన
సొంపారంగనాగభూషణములునవ్యముగను। వ్యాఘ్రాజినాంశుకవ్యక్తిసొం
పారంగపాణిపద్మంబులఁబరసువరము। నభయంబుశూలంబునద్భుతడమ
రునువిలసిల్లశృంగారవిభవమెసగఁ। జంద్రకళాజాతిసౌందర్యమొప్పార
నమితఁదేజస్ఫూర్తినవహసింప। దివ్యవిభ్రమకాంతులుదేజరిల్ల। నిఖిలభూ
షణలాంఛననియతుఁడగుచు। ప్రమథతతిగొల్వనెంతయుఁబ్రమదమెసగఁ *
హరుఁడుగిరిజకుఁబ్రత్యక్షమయ్యె నంత ॥౩౮॥... ... ... *
ఆవె॥వ॥అయ్యవసరంబుననప్పార్వతీకాంతయమ్మహాదేవునిగనుంగొనిపర
మసంతోషంబుననిట్లనివినుతించె॥౩౯॥క॥ జయజయవిశ్వాధీశ్వర । జయ
జయసర్వజ్ఞభర్గశాశ్వతమూర్తీ । జయజయశంకరపాలయ । జయజ
యవిశ్వప్రకాశశర్వనమస్తే॥౪౦॥వ॥అనుచు ప్రణమిల్లిన॥ ౪౧॥చ ॥విను
తుఁలోనపార్వతివినుచువిశ్వగురుండు సదా శివుండనుం। వనజదళాక్షి
పార్వతిభవద్ఘననిత్య తపోనిరూఢికిఁ। మనమునసంతసించితిమి మత్పటు
మూర్తివిశేషలీలనీ। వనిశము నర్ధభాగమున నన్ను రక్తివసింపు మింపు
గాఁ॥౪౨॥వ॥అనిపలికిబహుమానంబుగానఁబికను దనకరాంబుజంబునఁజే
రంబిలిచినపరమానందంబు నొందుచుయప్పార్వతిలజ్జాతిశయంబునప్ర
ణామపూర్వకంబుగాఁగృతాంజలియైమదీప్సితంబెఱింగినసర్వజ్ఞుండవునే
విన్న వింపంబనిలేదైననుమదీయజనకుండైనహిమగిరింబ్రార్థించినన్నుఁగ
ల్యాణంబవధరింపుము-యనంతరంబనన్నుఁదోడ్కొని కైలాసంబునకుపిచ్చే
యుఁడనినశివుండాడంబడియట్లుసేయంగల వాఁడనని నిజస్థానంబునకరిగె
నంతఁబార్వతియుసఖీజనసహితయైనిజనివాసంబునకుఁజనియెనంతనిక్కడ॥
౪౩॥క॥ ఆరీతిగౌరితోడను। నోరూరుగవిన్నమాటను శ్వైఖ్యార్యా। పేరోల

గమైకొలువునఁ। దారాద్రివిభుండునూనితాండవమువిలిచెఁ ॥౧౨॥ వ॥ అట్లుపి
లిచినమహాప్రసాదంబని వారలువచ్చినం గనుంగొని ॥౧౩॥ గీ॥ భర్గుఁడపుడు

## శివుండు సప్తఋషులనంపుట

దనకు పార్వతీకన్యను । మహిమమిగులఁ బెండ్లిమాటలాడ। సప్తఋషులఁ బం
పెనం భ్రమంబేపార। శుభమనోరథంబు సొంపుదనర ॥౧౪॥ శా॥ ఆరీతిం
జనియంతనమ్మునులునీహారాద్రికిన్ వేగ సొం। పారన్ వచ్చుచు గాంచిర భ్ర
మునగంగాంభః ప్రఘోషోన్నత। స్ఫారోత్తుంగతరంగసంకులమహాచాతుర్య
ముల్ మిక్కుటం। బారూఢాభ్రతటిబవర్గాఁగదలి రాయాకాశమార్గం
బునన్ ॥౧౫॥ మ॥ పరమోత్సాహముతోడవచ్చుచును సొంపైయున్న నయ్యా
ద్రిచే। రిరిచేరంగను నన్నగాధిపుఁడు వారిన్ వేట్కఁ దోడ్కొంచుఁ బెం। పరు
దారన్ నిజమందిరంబు కడవింతైయున్న సౌధంబుడ। గ్గరసింహాసనచక్రవా
ధ్యమున బంగారంపుటీరంబునన్ ॥౧౬॥ క॥ మించినభక్తిని వారల। నుంచుచును
గిరీంద్రుఁడనియెనో హో భాగ్యం। బంచితముగ ఫలియించెను। దంచితముగ
ననుచు వారనందరనరసెన్ ॥౧౭॥ గీ॥ అర్ఘ్యపాద్యవిధులనర్చించి వేవేగ। స
ముచితాసనముల సరసనొసఁగి। సహిత శాంతగతినమస్కారములు జేసి। విన్న
పించె నధికవినయమెసఁగ ॥౧౮॥ ఉ॥ మీరు మహానుభావులరు మీ మనసా
ధ్యము లేమయొ చెప్పరన్। భూరికృపావిశేషమునఁ బుణ్యుఁ జేఁగా నను గారవిం
చిమి। రారయ వచ్చినారు దయ నానతియుండది యిష్టమెయ్యదో। నేరుపుతో
నొనరించెదను నిశ్చలభక్తిదయానురక్తులన్ ॥౧౯॥ వ॥ అనిననగ్గిరిసార్వభౌ
మునకు నమ్మహామునులిట్లనిరి ॥౨౦॥ శా॥ కైలాసాచలవాసుఁ డూర్జితమహా
కారుణ్యుఁ పుణ్యుండు నా। ఫాలాక్షుండు శంకరుఁ డర్థపసఖభ్రాజిష్ణుఁ డుద్య
త్కళా। శ్రీలావణ్యుఁడు సైనయీశ్వరునకున్ జెన్నొందమీ పార్వతిన్ ।
బాలాయంబుగ నిచ్చి కీర్తిమహిమల్ వర్ధిల్లుమా శాంతమున్ ॥౨౧॥ వ॥ అనిన
వినియమ్మహీధరవల్లభుండు సంతసిల్లి నిజభార్యాయుక్తుండైయింత కన్నమన
కు భాగ్యంబెయ్యదియని యమ్మహేశునకుం దనతనయనిచ్చుటకియ్యకొనియె

నంతనమ్మహోత్సవానందంబు నొందితద్వృత్తాంతంబంతయు కైలాసంబున
కరిగి సదాశివునకు విన్నవించిన సంతసిల్లి యమ్మహాదేవుండు నందికేశ్వరునవ
లోకించి వైవాహికోచిత ద్రవ్యంబులు సంపాదింపుమనిన నతండట్ల సేయను
ద్యోగించె నిక్కడ హిమవంతుండు నిజపురంబు విచిత్రంబు సేయించి నిజకుమా
రీవివాహోచిత సకలసామగ్రీసంపాదన ప్రయత్ననిష్ఠుండయ్యె నం
త॥ ౫౨ ॥ శా॥ శ్రీనందీశ్వరుఁడర్థిఁ గూర్మి విలసచ్ఛృంగారభృంగీమహా। స్వా
నందప్రమథాధినాథులు నిజాహంకారముల్ మీరఁగా। నానావాహనవాహి
తాత్ములగుచున్ నాగేంద్రభూషాంగులై। యాత్యుగ్రప్రభఁ గొల్చి నిల్చి రిభ
ఖడ్యాసంగదిమ్నాంబులన్ ॥ ౫౩ ॥ చ॥ గరుడుని నెక్కి శార్ఙ్గకణకల్ జను
దెంచె రమాసమేతుఁడై సురుచిరశంఖచక్రపరిశోభిగదాధర హస్తపంకజ
స్ఫురితరుచిప్రకాశితప్రసిద్ధపురందరనీలదేహుఁడై। పరమమునీంద్ర సంఘ
ములపారము గొల్వఁగ శంభుపెండ్లికిన్ ॥ ౫౪ ॥ వ॥ తదనంతరంబ సాంగవాహ
నాయుధశక్తిభూషణశృంగారులై బ్రహ్మాదిదేవతాగణంబులును దిక్పాలురు
ను రంభోర్వశీమేనకాద్యప్సరసలును గొలిచి నతజనంబులు సలుపఁ బంచమ
హావాద్యంబులు మ్రోయ నందివాహనారూఢుండై వివిధరత్నమయకనక
కిరీటకేయూరాదిసమస్తభూషణభూషితుండై చండీశాది ప్రమథులు కైవా
రంబులు సేయ సదాశివుండు కదలుటయు తద్భారంబున వసుధ రాచక్రంబు త
రంబు గ్రుంగిన కుంభసంభవుం గనుంగొని దక్షిణమలయపర్వతంబున తద్భా
నివారణార్థంబు పొమ్మని నియమించి తాను వచ్చునంతకు నిక్కడ హిమవ
న్మహీధరంబు ॥ ౫౫ ॥ ఉ॥ మేరువు గంధమాదనము మేచకముఖ్యనిషధంబు వింధ్య
మున్। వారణచందనాచలశివప్రియరోహణరత్నపుష్పభూ। భారవహాది శైల
ములు భాగ్యపరంపరలుల్లసిల్లుచున్। ధీరతకల్పవృక్షసురధేనుసమూహము
గొల్వ భక్తితోన్ ॥ ౫౬ ॥ క॥ యెదురేగు దెంచి శివునకు। ముదమున మ్రొక్కుచు
నుశీతభూభృత్పతిస। ద్మంబున కానుకలొసగెను। సదములనవరత్నకనకసం
దోహములన్ ॥ వ ॥ అపుడమ్మహాజనసంకులంబయ్యు ద్భుతంబయ్యెనంతనమ్మ

హాదేవు దోడ్కొనివచ్చి నిజమందిర సౌధ ప్రదేశంబుననునిచె।నంతశుభము

## గౌరీ కల్యాణంబు

హూర్తంబాసన్నంబగుటయు॥౫౮॥శా। కల్యాణోచితసద్వలక్షణకళా
కాంతోరభూషాగజాత్కల్యాణిహిమశైలరాజతనయన్ కాంతానశిగా
పార్వతిన్।కల్యాణాధివివాహమయ్యెశివుఁడాకాశమూహలో త్సాహకృ
త్కల్యాణధ్వనులుల్లసిల్లశుభమాకల్పాంతరస్థాయిగాన్ ॥౫౯॥వ॥అట్టిమ
హోత్సవంబునసురలుకుసుమవర్షంబులుగురియించిరి దేవదుందుభినిన
దంబులు మ్రోసె।బ్రహ్మస్తుతిశతకోటిదేవతాగణంబులు దక్కినసమస్తజనం
బులునగమానందంబుఁబొంది రాసమయంబున వేదాంతోపనిషద్వచనంబుల
సమ్మహాదేవునిస్తుతియించిరి-యనంతరంబనమ్మహీధరవర్యుండునవినయం
బుగాసమస్తంబురీశ్వరునకుసమర్పించినంజేకొని పార్వతీసహితుండై
సర్వదేవమునిగణంబులుగొలువనందివాహనారూఢుండై మహావిభవంబు
నఁగైలాసగిరిఁజేరిపరమానందంబుఁబొందియు డిమురునాదునాదిగీశులుదెచ్చి
నకట్నంబులుబరిగ్రహించి ధికారంబునకుఁగుబేరునియోగించి మందరహరిసుగ
జ్యేష్ఠులకుకట్నంబులిచ్చియితరజనంబులకుఁగట్నంబులొసంగుటయుకుబే
రుముఖుంబుగానడచెనంతమీవారువచ్చిన్ జూచిధనముండెరిగిశివునకిట్లని
యె॥శా॥ ఊరవ్యుల్పరమేశనీపదమున న్నూహించినిస్థాపరే।స్థారూఢిన్
దవమాచరించిగరుకశాస్త్రాగర్భనీచిత్తమె।ట్లేనీతిన్నునట్లసేయుమనెంతే
ప్రొద్దుదింతిం చిగౌరిరామామణినాయకుండనియెవారిన్ జూచియుప్పొంగు
చున్॥౬౧॥వ॥ పరమేశ్వరుండుదరహాసితవదనారవిందుండైసమస్తజనంబు
లువినవిట్లనియె॥౬౨॥ ॥ పరమపదస్థానంబగు। వరకైలాసంబునందువతింపం
చంగా।సురుతిప్రఖచరుశాశ్వ।బిరవుగనీవైశ్యమునులకెల్లనుగలిగెన్ ॥౬౩
గీ॥అట్టిశాశ్వతహిమనజ్జు వచనంబుదెలిసి।వీరిధాత్రినెలవుకొల్పబుద్ధిపు
ట్టెనామదిబూర్వపురాకృత- గర్మమెట్టివారుగడపరాదు॥౬౩॥క॥అనినను వి
శివశివశివ-యనుచుమవందనముజేసిరందరువినియ-వ్వాసజభవాదులకైనను
గనివినితెలియంగరాని కైవల్యంబున్॥౬౩॥క॥వెరవొప్పనిచ్చియపుడా- ధర
ణీస్థలికేగుమనుటనయపవ్వటమీ-చరణయుగపహిత సేవకు-మనిగినమాము

నసుధకమరుగడుచు ద్రా ॥౧౪॥ వ॥ అనిమీవారలప్పరమేశ్వరునకువిన్నవిం
చిన ॥౧౫॥ క॥ అచ్చటికథమునుపేరిమి-కచ్చుపడఁదెలిపితగినయామునితో
డఁ-సచ్చరితులుయిట్లనిరము-రచ్చటిశివుతోడనప్పు-డాతనిమాటల్ ॥౧౬॥
గీ॥ తెలిసుబల్కి వారుతిరిగివచ్చెడువేళ। నెచటనెచటమహిమలేమిగనిరి।
పనఁగఁబలుకుసకలవిశ్రుతబహువేద। చయమెఱింగినట్టిసంయమీంద్ర ॥
౧౭ ॥ వ॥ అనివిన్నవించినమీవారలకమ్మహాత్ముండిట్లనియె। నట్లమ్మహా
దేవుపాదపద్మంబులుజిత్తంబులనిడికొనినిర్భీతులైయిట్లనిరిమహానుభా
వాభూలోకంబునకరుగుటకుమాచిత్తంబులొప్పకయున్నవి నేమిజనుట
కోపమునననప్పరమేశ్వరుండువారలకిట్లనియె ॥౧౮॥ మ॥ జగతిన్ పావ
నభూస్థలిన్ ప్రకటితానర్తతలీలోల్లస।న్నగరాష్టాదశపాలనప్రభువులై
వానాప్రకారంబులన్। నగరస్వాములనంగనుండుదుమహానందంబుసంధి
ల్లనే। నగరేశేశ్వరమూర్తిగైకొనిప్రకాశత్వంబుతోనుండెదన్ ॥౧౯॥ వ॥
అనినవైశ్యమునులమ్మహాదేవునకిట్లనిరి ॥ ౨౦ ॥ గీ॥ స్వామియాజ్ఞాప్రకా
రంబుసంతతంబు। శిరమునదాల్చియుందుముధరణిలోన। నెట్లనోత్తమ
సకలలోకేశ్వరైన। సర్వమంగళపాదదర్శనముమాకు ॥౨౧॥ వ॥ అనినన
ద్దేవుండిట్లనియె ॥ ౨౨ ॥ క॥ అనిశముమదీయసంగతి। వనజాంబకగౌరిపఁథ్య
వాసినియనుపే। రనునిల్పిమిమ్ము బ్రోచును। ఘనసంపదలిచ్చియధికకా
రుణ్యమునన్ ॥ ౨౩ ॥ క॥ నియతప్రాధిపునధిక। ప్రియమునబ్రహ్మేశభవుఁ
డభీష్టార్థదుఁడై। జయమొసగిభాస్కరార్యుఁడు। దయతోమీకనుబు
రోహితత్వముసేయున్ ॥౨౪॥ క॥ కులమభివృద్ధిగదీవెన। లలరింపుచునలువ
భాస్కరార్యుండును నై*యిలలోజనియించిభవ*త్కులగురువై మెలఁగు
చుండుఁగౌరియునెపుడున్ ॥౨౫॥ వ॥ అనియానతిచ్చినమహాప్రసాదంబని
మ్రొక్కిపీఠికానిష్ణుదేవునిసన్నిధికింజని ॥౨౬॥ శా॥ ఆనందంబునవైశ్య
శేఖరులుసాష్టాంగప్రణామంబులన్। శ్రీనాథున్ కరుణావలోకనశుభశ్రీ
డావిహారోన్నతున్। నానావైభవసద్గుణాఢ్యు నిజగన్నాథున్ జయోపేతు

ను। జ్ఞానసాంద్రంతుని వేనుతించిరభివాంఛాదానచాతుర్యునిన్ ॥ ౭౭॥సీ॥ శ్రీర
మ్యసంతతోదాగవిభాసితసకలలోకోద్భవస్థానచతుర। బ్రహ్మణతాధికావాస
వప్రముఖదేవకిరీటవరమణివిలసిత చరణకమల। కౌస్తుభమాణిక్యకమ
లాలయాకాంతిలలితవక్షఃస్థలోల్లాసహృదయ।సద్భక్తలోకవాంఛాఫలప్ర
దదేవయాతరాకౌనారాయణముకుంద। పుండరీకాక్ష వైకుంఠభువనవంద్య।
యనఘదాసానుదాసులమైనమమ్ము। గగుణభావించిరక్షించు కమలనాభ।
ఘనతలక్ష్మీకటాక్షంబుగలిగియుండ॥ ౭౮॥మ॥అనిభక్తిన్ నుతియించు వైశ్యు
లన్ గృపాత్రాణలోకనప్రహృష్టిని। ట్లనిరోయీ మీరు సుపర్వశిల్పికృతన
వ్యాస్టాదశగ్రామపా। లనవిఖ్యాతిననేకకాలముమహోల్లాసంబుతో
భూస్థలిన్। ఘనులైయుండుడు సర్వమాన్యులయిలోకస్తుత్య చారిత్రులై ॥
౭౯॥క॥దనుజారిట్లనెనుజనా।ర్దన నామముతో డమీపురంబునరహస్తో।డను
గూడియుండుమవరము। లనోసంగుచునహారహంబు లోకము మెచ్చన్॥
౮౦॥గీ॥ భక్తులున్నచోటపరమానురక్తిలో। హరుండు నేమునుందుమహర
హంబు। గానమీరుధరకుగమనీయగతి నేగి।మహితభక్తియుక్తినుండుమని
నులు॥౮౧॥క॥శ్రీమన్నారాయణుడును। హోమునమునవాడిన ట్టియద్భుతవ
రముల్। ప్రేమంబునగొనిగౌరిర। మామహిళలనునెరంగి నుహిమదలి
వర॥౮౨॥క॥హరిహరులహృదయకమలము।లగయంబునలిపిభక్తులను
తించిసురా। గ్ర రమణునంబోగడిసుధీ।నరులనుతింపుచునుగదలువారైయచ
టన్॥౮౩॥వ॥అంతనవైశ్యవరులప్పహోవేవుగడమంజనిమాకుసహాయం
బుగావలయుననిప్రార్థించినమీకుపితృకర్మసబ్రహ్మానుసహాయంబిచ్చి
తిననిపలికినవీట్లానిరూ౮౪॥వ॥చనివేగంబున వారలగ్గిరికిసాష్టాంగంబుగావిం
చిగొ।బ్బున శైలంబులుజాహ్నవీనదులుతెంపుగాదేవతావర్ణంబులు।ద్యనట
త్కౌతుకయక్షరాక్షసమునివ్యాపారముల్ జూచుచున్। కనిరాచెంతవి
యన్నదీజసితరంగత్తుంగవీచ్యోఘముల్॥౮౫॥క॥ఆదిగ్రవిచిత్రంబులు।కాచా
తుర్యములకలరియవగాహనులై। వేచనుదెంచిరియావల। చూచుచుహి

మవన్నగంబుజూచిరివేగ ॥౭౫॥క॥ నగపతికిని మ్రొక్కుచుహిమ॥ నగమటుదాటిరికదలిసనాతన బుద్ధిన్ ।నగపతిధైర్యులయోధ్యా।నగరంబటుఁజూచుచునువినమితప్రద్యుమ్నలై॥౭౬॥వ॥మరియుహరిద్వారంబును - సింధుసరయూనదులును-త్రివేణీసంగమంబును -నాసికాత్రియంబకంబును-కాళేశ్వరంబును-వృద్ధగంగాతీరంబును-జూచిపుష్పకంబుడిగ్గిరనిసాలంకాయనముని తరువాతవృత్తాంతంబుసెప్పఁటకై-యుపక్రమించుటయు॥౭౭॥ఉ॥ *పండిత భాస్కరార్య సుత భాస్వ రులంచితభోగవాసనా। ఖండలులంగనాకుసుమకార్ముకులూర్జితనవ్య శేముషీ। కుండలిరాట్సమానులవికుంఠితధైర్యులు బ్రహ్మపాలనా। ఖండదయాపథులతిధార్మికులుత్తమవైశ్యులిమ్మహిన్॥౭౮॥మాలిని॥సగణనగరశంభుస్వామిపాదాబ్జసేవా।నిగమవిధివిధేయుల్ నిత్యధర్మానుష్ఠాయుల్।సుగుణగణవిశాలుల్ శోభనోద్యోగశీలుల్।ప్రగణితపెనుగొండప్రాముఖ్యులూరవ్యముఖ్యుల్

గద్య

*ఇదిశ్రీసరస్వతీవిలాసచరణసరసీరుహసద్యోమకరందబిందుసందో*
*హపానధురంధురీణమధుకరాయమానమానసమరసకవితావిలాసశ్రీసు*
*భాస్కరాచార్యనామధేయప్రణీతంబైనవైశ్యపురాంబ*
*యనుమహాప్రబంధంబునందు మన్మథుండు ఈశ్వరునిచేద*
*హింపబడుటయు। రతీప్రలాపంబును।మదనపున*
*ర్జీవనంబును ।పార్వతీదేవితపోనిష్ఠయుశి*
*వుండువివాహార్థంబుసప్తఋషులనంపు*
*టయు।శివునివివాహంబును।శివుండు*
*పత్నీసమేతుండైకైలాసంబున*
*కరుగుటయు।గంగాదినదీప్ర*
*భావంబును ।ననుకథ*
*లంగలదిచతు*
*ర్థాశ్వా*
*సము*

శ్రీరస్తు.

# వైశ్యపురాణము.



## పంచమాశ్వాసము

శ్రీమద్భువనవకసంఖ్యా। గ్రామ గ్రామణులుగీర్వాణరమణులుసత్య।
ప్రామాణికులుమరుద్రుమ। నామ ప్రాభవులు బాలనగరవరేణ్యుల్ ॥౧॥ వ॥
ఆకర్ణింపుము॥౨॥క॥అక్కథకుండిట్లనియెను। శిష్యులనాయకులకు వ్యాసమునీతిక
ళాస। వ్యాక్కులనాచాతురి పెం। పెక్కగ వినుఁడనినయంతనిట్లనిపలికిరి॥౩॥
మ॥అగరాజాత్మజనాయకుండనినయట్లారీతి వేవేగన్నా। సొగసౌసూర్యరథం
బువచ్చుగతితోసొంపొందుచుంజిత్రసూ। నిగమాధిష్ఠితధాతారూపమయ
మానీపుష్పకారూఢులై। గగనంబందులరాదొడంగిరిమహాకౌతూహలంబొ
ప్పగన్॥౪॥క॥ఆకీర్తిననదీనదవి। స్తారయహోర్యాధిపతినిదర్శింపుచుమా। వా
రంతటపూర్వాంబుధి। తీరంబునఁబుష్పకంబుడిగియటహారియుఁన్॥౫॥క॥ప్రా
దమధ్యంబున నేమని। ముదమొప్పఁగనిల్చిరిష్టమునమరి వారె। య్యెదిపనిగాన
పచిరదియు। విదితముగాఁదెల్పు వేదవేదాంతనిధీ॥౬॥వ॥అనిన వైశ్యఋషుల
కుసాలంకాయనఋషియిట్లనియె నట్లకోకలనంగలయాశ్చర్యంబులవలో
కించి బ్రహ్మకిట్లనిరి॥౭॥చ॥కమలినియొక్క నాళమునఁగాంచనదీధితులుల్లసి
ల్లుచున్। విమలములైనపుష్పములు వేడ్క త్రయంబటుగానవచ్చినన్। త్రమ
శమునొందిచిత్రగతితద్భవనగస్వాయనాధులుబ్బునన్। కమలజయిట్టిధంబయి
నకారణమేమదియానతీదగున్॥౮॥వ॥అనిన వైశ్యులకువిరించియిట్లనియె॥౯॥

చ॥కలడుపులస్తినాగముని కాంతుడుయజ్ఞము సేయభక్తితో। యెలమిమహేశ్వ
రుండుగిరిజేశ్వరి శాజ్ఞయయు నేనుగొల్వఁగా। నలఘుతనగ్ని కుండమునవద్భు
తభంగిప్రసన్నుఁడైమనం। బలరగవేదువాంఛితపదార్థములన్ననతండు
మ్రొక్కుచున్॥౧౦॥ఉ॥ ప్రాకటమైన వాక్యములఁ బ్రస్తుతిఁజేసివిశేషభక్తి

తే॥ నాకు మనోరథార్థములు నవ్యముగాగ ననుగ్రహించినీ। వేకతసవర్ణలోకములనిచ్చుమెరింగి కృతార్థుఁడౌటకుఁ। జేకొని సన్నిధైయిచట చెన్నవహించనవశ్యమెంతయుఁ ॥ ... ... ... ... ... *

వ॥ అని ప్రార్థించి పలికిన నమ్మహాదేవుండప్పద్మమూలంబున జ్యోతిర్మయ లింగంబై పృథివికి మూలస్థానంబునఁ బగిగి మల్లికార్జునేశ్వరుండను బుల స్త్రీశ్వరుండను నామంబులఁ బ్రకాశించియుండె। నయ్యగ్నికుండంబువలన జ్వాల నజ్వాలాజాలంబులు జలంబులై మహాపుణ్య నిలయంబయ్యె నదివుల స్త్యతీర్థంబు దీని సమీపంబున మీకొక నగరంబు నిర్మించెదనని విశ్వకర్మం జూచి పట్టణంబు నిర్మింపుమనిన తత్క్షణంబ ॥౧౧॥ ఉ॥ ద్వాదశ సూర్యవీ

— పెనుగొండపట్టణవర్ణనము —

ధులను దారత షోడశసోమవీధులుఁ। మోద మెలర్పగా కనకముఖ్యగృహంబుల నేకభంగులఁ। యాదరమొప్ప కేతనమృగాధిపగోపగజాయసంజ్ఞచే। నాదివిగాగ నవ్యగతి నంచితవర్గపద్ధతి సృజించినన్ ॥౧౨॥ క॥ వివిధామరగేహంబులు। వివిధామరభవనహర్మ్య వేదీతతులున్। వివిధోద్యానవ్రజములు। వివిధపురద్వారభద్రవేదికతతులన్ ॥౧౩॥ వ॥ ఈరీతి నగౌతమీతీరంబునఁ బురంబు సృజియించెనంత విరించియునవ్వైశ్యవరుల జటావల్కలంబులు పరిహరించి పత్నీసమేతంబుగా మంగళస్నానంబులు సేయించి దివ్యభూషణవస్త్రంబులు ధరియింపం జేసి ఘనదుర్థరంబను పేరుగలదై శారదాపీఠంబు సత్త్రగోదావరీతీరంబున నియమించి యట వసియించు బ్రహ్మమండలంబులఁ బిలుపించి యస్మద్గణంబువిన నీ భాస్కరాచార్యులవారే కళవింశతిపీఠంబులవారు నా యంశంబున నవతరించిన వారని వారలకుం దెలిపి వారల ముందరయీ వైశ్యవరుల కులగురువులను బురోహితులను నియమించి కృతార్థులుగన్ముని వైశ్యవరులకు నొప్పగించి వారల చేత వరంబులిప్పించిన యనంతరంబయప్పురంబునకుఁ బశ్చిమ భాగంబున భూసురవిసరంబును ప్రాగ్భాగంబున రాజన్యసందోహంబును। దక్షిణోత్తరభాగంబుల సచ్ఛూద్రనివహంబుల

సుదక్షిణ నవర్ణంబులవారలయధోచితస్థానంబులనుండ నియమించికోరిన
వరంబులిచ్చి నయనంతరంబ ॥ ౧౪ ॥ క॥ యత్నేశ్వరుఁడతిముదమున। నతు
యముగధనములిచ్చియవనీస్థలిమా। దీక్షాయంశంబునమిము। రక్షింపుదుననివ
రంబురయిమునన్నిచ్చెన్ ॥ ౧౫ ॥ వ॥ మరియును॥ గీ॥ మరకతమణిదీప్తసహిత
మైమించిన। మనుజకేతనంబుమహిమనిచ్చి। దానధర్మకీర్తిధనదాంశులన
మీరు। వసుధవెలయుఁడనుచువరములొసఁగె ॥ ౧౬ ॥ చ॥ పురమునకొప్పు
డూపురాననుఁబొల్పుగఁగౌతమిదక్షిణంబునన్। దరుదుగనంబురాశిసదహం
కృతిచెల్వ సుపశ్చిమంబునన్। పరఁగినగోస్తనీనదివిభాసితమై దగునుత్తరం
బునన్। యరయవసిద్ధగంగయుసమాగతమై నహ్రదంబునెప్పుడున్। ౧౭ ॥
క॥ సీమాంతరములుదీపుచు। సామర్థ్యంబునపురంబుజతురత్వమునన్। శ్రీ
మత్క్షేత్రంబులనా। రామంబులనేకవిధులరచియించితగన్ ॥ ౧౮ ॥ క ॥ ఆ
రామంబులమహిమల। కారాజీవాసనుండుయద్భుతవృత్తిన్। ధీరతవర్ణన
సేయగ। జారుతరంబైతనచుఖశంభునిఁగరుణన్ ॥ ౧౯ ॥ సీ॥ తరుముఖాపికాదం
తదళితంబులై జారివడినాళికేళసత్ఫలములంట। దాకిపవడినోడిదండడి వ్రా
లెడిపనసపండులఁజేతభగ్నమైన। యిక్షుకాండంబుల నెర్పులనంములమొదల
మిట్రించినముత్తియములఁ। బెడగుఁగామించెడివడగండ్లవర్షంబుబోరిపొ
రిసురిసినఁబోల్కిఁగాగ। రెక్కలందందఁడాకిననుక్కుదక్కు। యొగయుహం
సలముక్కులఁదగి వెడువడి। రాజనపుమళ్ళసీళ్ళలోరమణదిరుసు। శఫరదంచ
తులనగల్గుసంతతంబు॥ ౨౦ ॥ వ॥ మరియుసవ్వనంబుసంగలనారంగమాతులుం
గలవంగపుగ్నాగదాడిముఖర్జూర చందనమందారవాసంతి కామల్లి కా
మంజరీకుంజనిర్వ్యంద మకరంద ధారాప్రవాహాలోలకల్లోలమాలాక్రీడద్వ
రాళీమరాళీపత్రచాలనచాతుర్యధుర్యంబులగుమందానిలంబులకానంద
బునొందుచుంచుంచిరబృందంబులపాటలంగలపాటలంబులసీడలఁగ్రీడలంచే
లివేడుకలఁగూడికమ్మపూబొదరిండ్లకెలంకులవిహారణంబొనరింపనింపెసగు
మధురగంధపద్మపదీసముంచితఫలంబు కాగానంబుల ప్రోడి సేయునటంత

కలకంఠనినదంబులమోదంబులంగలిగియు నందనవనచైత్రరథంబులం
బోలునారామంబులుగలిగి యొప్పుచుండునప్పట్టణప్రాంతసంవృతభూభా
గంబులు ॥ ౨౧ ॥ సీ ॥ శ్రీరామవంకియుఁజిటిబలుగుత్తియు శ్రీకేసరియుశ
క్తిశ్రీధరంబుఁ యీశ్వరప్రీతియు నేనుఁగుకొమ్మునుబోడసంపంగియు నోడవ
రియుఁ కస్తూరినికరంబుగపూరభోగియు కావలి కాంభోధికనక గిరియుఁ దే
వాన్నమెలిమియు దేవగన్నియకొట్టినీగుచంచలియు శృంగారభోగి * వంకి
ప్రాసంగిసంపంగి వారణాశి * శాముధేనువునారేళి గ్రంధగోళి * వెదురుమ
లయంబుబుడమియు వెలువడంబు * రాచమెచ్చునుములువంకి రాజనములు ॥
౨౨ ॥ క ॥ శనిగెయుఁగోధూమంబును * మినుములుముద్గంబుకందిమెంతెయు
మిరియఁ * బనుములు మొదలగు సస్యముఁ * గొనకొని పుగరుణకొండకోటు
లుపండుఁ ॥ ౨౩ ॥ వ ॥ మరియు బహువిధవిశేషంబులకు బహుగోత్రసమ్మ
ర్థంబగుటంజేసి పెనుగొండయనునామంబొనర్చి వులస్త్యతీర్థోపరిస్థలం
బునదివ్యయంత్రశిలాస్తంభవినిర్మితప్రాసాదప్రాకారవలయంబులగు
దేవాలయంబులు నిర్మించియనంతరంబ ॥ ౨౪ ॥ క ॥ ఈలోకంబులకెల్లను *
మూలస్తంభంబనంగ ముఖ్యప్రతిభఁ * మూలస్థానమహేశ * స్థూలకళావా
హనంబుసొంపుదలిర్పఁ ॥ ౨౫ ॥ క ॥ నెగడినశైవాగమవిధి * నగణితమ
గుమహిమలొసఁగనతిభక్తిరతిఁ * నగరేశ్వరదేవేశ్వరు * దగసొంపలరఁ
బ్రతిష్ఠఁ దద్దయుఁ జేసెఁ ॥ ౨౬ ॥ క ॥ వెలయజనార్దనదేవుని * కలితమహ
త్వప్రకాశుకమలాధీశుఁ * విలసితవైష్ణవవిధులను * జలరుహగర్భుఁడు ప్రతి
ష్ఠచతురతజేసెఁ ॥ ౨౭ ॥ గీ ॥ అరయవింధ్యవాసియ సమహాశక్తియుఁ *
గురుతరాత్మికఫలకోనకమల * వివిధదుర్గాలుబహువిధభైరవులునధిక *
ఘోరదేవులనఁగ బ్రబలించు ॥ ౨౮ ॥ క ॥ హరుఁడటునగరేశ్వరుఁడై * గిరిజ
యు నావింధ్యవాసి కృష్ణుండరయఁ * బరగజనార్దనుఁడయ్యెను * గరుణిం
చుచులక్ష్మికోనకమలై వెలసెఁ ॥ ౨౯ ॥ ... ... ... ... *

వ॥ మహాగణపతిపురస్సరంబుగా నేతత్స్తవరాజ ప్రతిష్ఠలొనరించి విరించి యి
ట్లనియె ॥౩౦॥ సీ॥ అఖిలలోకారాధ్యుఁడైనట్టి శంభుఁడు నగరేశ్వరఖ్యాతి
నలరినాఁడు । కైవల్యసుఖదాయి కమలాధిపతి శౌరి హరి జనార్దనుఁడయి
యలరినాఁడు । శర్వాణి పార్వతి సర్వమంగళ గౌరి వింధ్యవాసిని యనవేల
యుచుండు । కమలాక్షి శ్రీలక్ష్మి కాంతాశిరోమణి కోరి వేలానగూర్చుకొనక మ
ల । ఘనతఁ బెనుగొండపురవరంబున సమీపమున । వరములొసఁగుచునుందురు
వైభవముగ । భవ్యమైనట్టి నామాంతరప్రబలినాఁడు । భాస్కరాచార్య వ
ర్యుండు ప్రతిదినంబు । వీరి సేవించి వెలయు డీవిశ్వమునను ॥౩౧॥ వ॥ మఱి
యు నానాదేవతానీకంబులకుఁ దిష్వస ప్రతిష్ఠాయోగంబులు నిర్ణయించి యనంత
రంబు వైశ్యజనుల వీక్షించి యిట్లనిరి ॥౩౨॥ క॥ మాకోరికె సఫలంబుగ । నేకాల
మునిచటనుండు డెంతయు వెట్కగ । మాకులము వారికెల్లను । ప్రాకటముగ
గురువులగుచు బ్రాహ్మణవరులై ॥౩౩॥ వ॥ అని ప్రార్థించిన చతుర్ము
ఖుండవు గాకయనుచు కోరినవరంబులిచ్చి యాన్నంతరంబ - ధర్మధన - శివ
పాంచాల - నిరవద్య - జగన్నాథ - క్షీరకాసార - యేలాఖ్య - జొందూరు - ఘంటసా
ల - త్రిగుణిత - ఘనభిను - విశాల - కళింగనృసింహ । వీరనారాయణ । నగరవీడు
యూస వర్తిత గ్రామంబులు బెనుగొండకు గ్రామ గ్రాసంబులుగా నిచ్చి న
నత్యంతశోభితంబై తనచేతనట్లు ప్రవృద్ధసంభవులుగు పాతకయంబున ॥౩౪॥ క॥
కోటికి నెత్తినపడి గెలు । కోటీశోక్కనింటకోమరెందునర్గ ॥ పాటించిని
త్యలక్ష్మికి । పేటని వర్ణింపవచ్చుఁ బెనుగొండపురిన్ ॥౩౫॥ క॥ పంచ ప్రాకా
రంబులు । వంచింపక తిరిగిరేని వసుధాస్థలమున్ । గొంచ్చ కతిరిగిన ఫలము నిపం
చాస్యుఁడు విశ్వకర్మ బ్రతినయొనర్చెన్ ॥౩౬॥ క॥ అక్కరఁ గోరిక బేరుని
నిక్కము యిడు గంగ నేలనిలలో వైశ్యుల్ * రొక్కము చవుకఁ జదురా * పె
క్కులు వర్ణింపనేల పెనుగొండపురిన్ ॥ * * * * **
ఉ॥ ౪౦ ॥ మాడలు సూరు జీత మొకమానిసికిన్ నెలనాళ్ల కట్టడా । మాడకు నూ
రు చిన్నములు మానుగ చిన్నమునూరు కాసులా । వాడనె క్రొత్త దొడ్డ నెలవా

సులకాసుకనూనసన్నపుం । బ్రోడలు లెక్కఁ బ్రాసుగులుపోకపు పుష్టైన
పట్టణంబునన్ ॥౪౧॥ క ॥ ఆందోళీకాదివాహన । సందోహారూఢవృత్తిసత్ప్రభు
వనకున్ । నందికునకునీచనకును । దండడి పెనుగొండపురిని దలప్రక్కల
గున్ ॥౪౨॥ ఉ॥ ఈవణిగగ్రహారమిల వేన్నవుఁ జైనను సర్వమాన్యశం । భావము
నొందిరక్షణము భక్తినొనర్చరియేని కోటి వేం । గోవులనిచ్చుపుణ్య మగులో
భతనీపురమీకుఁ ద్రోచినన్ । గోవధ జేసినట్టియతిఘోరపుపాపము నొందు
వారికిన్ ॥౪౩॥ వ ॥ మరియునట్టి పెనుగొండపురంబు కైలాసంబునుం బోలెన
వ్యాహతసకలసంపదలసొంపుమిగిలియభ్యుదయపరంపరాభివృద్ధియగుచు
మహాసమృద్ధంబయ్యెనయ్యవసరంబున విరించివిశ్వకర్మలను పేరు - భాస్క
రాచార్యులకును వైశ్యులనప్పగించి కులసంరక్షణంబునకు నియమించి పు
ష్పకారూఢుండై నిజనివాసంబునకరిగెనంతనిక్కడ బ్రాహ్మణసంభవు
లుదినదిన ప్రవర్ధమానులగుచు నిత్యోత్సవంబుల వెలుంగుచుఁ జతుర్దశోత్తర
సప్తశతసంఖ్యాత వైశ్యమునినిష్ఠాభిజాత్య పవిత్రంబులగు గోత్రంబులును త
ద్బ్రాహ్మణోపదిష్టశివమంత్రజపపరాయణులును నై - తద్వ్యతిక్రమంబునని
జవంశజన్యవ్యవహారధర్మపాలనంబున గృషివాణిజ్యగోరక్షణవృద్ధి జీవనం
బులును నను సంధింపుచు - శ్రీనగరేశ్వర జనార్దనుల కారుణ్యవిశేషంబున బు
త్రపౌత్రాభివృద్ధిఁ గలిగి వెలసిరని పాలంకాయసమునియానతిచ్చిన వినియ
వై వైశ్యవరులిట్లనిరి ॥౪౪॥ గీ॥ అందుచిత్రవిచిత్రంబులైన తెరఁగు । దెలుపుమ
నుటయు వారికిఁ దెలుపఁదొణఁగె - సరసభాషామనీష వాచానిరూఢి - సంభ్ర
మంబొప్పఁ జెవులకు జవులుపుట్ట ॥౪౫॥ వ ॥ ఇట్లు కృతత్రేతాద్వాపరయుగంబు
లు చనిన సమయంబున ॥౪౬॥ క ॥ సోమాఖ్యుండగు వైశ్యుఁడు । ధీమహిమాఢ్యుం
డటంచుఁ దెలియగమహిలో । నేమమున వైశ్యవంశ । శ్రీమంతుండగుచుఁ బొసఁగుమ
శైస్థైర్యపుష్టిన్ ॥౪౭॥ సీ॥ గంధర్వపతిచిత్రకంఠుఁడు సొంపున వైశ్యశాపమునొం
దిన సుధనకుఁడు । సువంశంబునసుర రాజభోగియై రాజరాజనరేంద్ర
రాజునకును । శుభముహూర్తగ్రహశుభదృష్టివేళలం బరమపవిత్రత్వ

భావస్ఫైన। సవర్ణలక్షణయగుశ వాణి దేవికిఁ వంశవర్ధనవిష్ణువర్ధనుండు
పరగజనియించిజగమెల్లపాలనంబు। సేయుచుండెను శ్రీరామచంద్రమూ
ర్తి । తల్లిదండ్రు లగురువులదైవములను। భక్తిఁగొలుచుచునుండెనురక్తి
తోడ ॥౪౭॥ వ॥ అట్టిసమయంబున॥ ॥౪౮॥ సీ॥ వైశ్యాన్వయఖ్యాతివారిధి
చంద్రుండువరమహేశ్వరభక్తియుతుఁడు। జాతుదశోత్తరసప్తశత
ఖ్యాతచిరగోత్రమూర్ధాభిషిక్తకుసుముఁడు। నగరేశ్వరేశ్వరునమ్మినభక్తుం
డువిహితమహైశ్వర్యవిభవయుతుఁడు॥ సకలధర్మాధారసంసారవర్త
నుఁడు శ్వాక్రూకులగోత్రపూజితుండు। వసుధకుసుమాఖ్యుఁడనమించిదిక
సుమగంధి। ఘనఁగదనవర్ణ్యయనుదానుననుదినంబు। బుధజనంబులబోషిం
చిపాలుపుసనర। ధర్మశాస్త్రంబువినుచుండుసత్త్వభంగి ॥ ౪౯ ॥ క ॥ గుడి
యునుజరువునువనమును। నడరగబెండ్లిండ్లునిధియునందితగ్రులియున్। బెడ
గుగనొనరిచియంతట। నుడుగకపుత్రార్థియగుచునుద్యతమెఱసున్ ॥౫౦॥
సీ ॥ ప్రాసాదగోపురప్రాకారములతోడనెసరఁగట్టించెదేవాలయములు
ధరసార్వకాలంబుబరిపూర్ణజలముగాఁజెరువులు వేయించెఁజిత్రగతులఁ
సహజమాధుర్యమై బహుఫలాంచితమైనవనములు వేయించెవరుసతోడ।
పూనిషోడశమహాదానంబులొనరించెనధికసత్ప్రభీఁగాథులునిలిపె। జెలఁగి
బ్రహ్మప్రతిష్ఠలు జేసియంత। తనచరిత్రంబుజగమెల్లవినుతిసేయఁ। గృతులఁజె
ప్పించెదిక్కులకీర్తినిలిపె। కులములోపలజగర్ఘట్టకుసుమశెట్టి ॥ ౫౧ ॥ క ॥
కుసుమప్రభునికులాంగన। కుసుమాంబయుదానధర్మకుశలతమెఱయన్ ।
వసుధాజనములుబొగడగ। సదృశగతితోమెలంగుననురూపముగాన్ ॥౫౨॥
వ ॥ అంతనొక్కనాఁడు ॥ ౫౩ ॥ ... ... ... ... ... ... *॥
చ॥ పొసఁగినపట్టెమంచమునవువ్వులపాన్పునవేడ్కమీరఁగా। రసికతభర్త
యుండననురాగముతోడనువీడెమిచ్చుచో। పసగలతాళవృంతమునఁబైచమ
టార్చిపదాంబుజాతముల్। బిసుకుచువిన్ననైమనసుభీతిఁజెలింపుచునుండె

నత్ప్రమై॥౫౩॥ఉ॥ అంత నెఱింగి విజ్ఞుఁడగు నా కుసుమాఖ్యుఁడు సాదరంబు
నన్ । గాంతను జూచి పల్కె నను కంపదలిర్పఁగ నీమనంబునన్ । జింతవహిం
చినట్లు నీకిఁ జెప్పు మునీకమనోరథార్థముల్ । సంతసమందనిత్తు నువిచారము
మాను ముదైన్య మేటికిన్॥౫౪॥ఉ॥దీనులఁ బ్రోవనైతివొ సుధీమతి వేల్పులఁ
గొల్వవైతివో । పూని కెనాడి తప్పితివొ భూసురకోటికి నిష్టమైన యా । దాన
ము సేయనైతివొ పదంపడి బంధుజనంబు నిన్నుఁ జా । సీనము సేసిరో మనసు
చింతకుఁ గారణ మేమి జెప్పవే॥౫౫ ॥వ॥ అని కుసుమవిభుండు కులాంగన నూఱ
డించి పలికిన విని కుసుమగంధి పతికి నిట్లనియె॥౫౬॥సీ ॥సత్పుత్త్రవతి గాఁగ శైశ
వక్రీడలు సొంపుగాఁగన్న లజాడలేమ । బాలురమాధుర్య భాషావిశేషము
ల్ వీనులకింపుగా వినఁగలేమ । వెలయఁగనాడుబిడ్డలకు నల్లుండ్రకు నిష్టప
దార్థముల్ యియ్యలేము । గమనీయధర్మార్థ కామమోక్షములకు నాస్ప
దంబైన పుణ్యంబు లేమ । నైహికాముష్మిక ఫలంబులందరాదు । హరునిఁ గృపజే
త సకలసౌఖ్యములు గలిగె । ననఘ సత్పుత్త్రుఁ జేయుపాయమునఁ గల్గు । నా
విధానంబు దెలసి నా కానతిమ్ము॥౫౭॥వ॥అనిన కుసుమశెట్టి యిట్లనియె॥ ౫౮॥
క ॥ ఈలోకసుఖము కంటెను । యాలోక సుఖంబె మేలు నాత్మజు కోరన్ నై
యేలా నీకు విచారము । జాలుర ధర్మంబు మనకు జలజాతాక్షీ॥౫౯ ॥క॥ అనుట
యు సతి బతికిట్లను । ఘన దానతపోజపముల కలిగిన ఫలముల్ । ఘనమతి లోకాం
తరమునఁ । దనయుండిహపర సుఖంబుఁ దడయక నిచ్చున్॥౬౦॥వ॥ అనిన కుసు
మగంధికిఁ దత్పతి యిట్లనియె॥౬౧ ॥ సీ॥అఖిలధర్మంబుల నాచరింపగవచ్చు నన
ఘుఁడైన మానుషయత్నమునను । దేవాసురలకైన భావింపగా గాని తనయుసం
ప్రాప్తి దాదైవికంబు । నీమనోహారమైన నిజపుత్త్ర సంలబ్ధి కలుగును పా
యంబు దలఁచువాడ । వెలయు సంతతి లబ్ధవిద్వజ్జనుల చేతఁ దెలిసి తదీయుపా
దేశమునను । సకలజనసన్నుతోదార సత్కుమార । లాభ మొనరింతు హృద
య విలాసమైన । యుక్తి సాధింతునని కాంత నూరడించె । మృదులమాధుర్య వా
గ్వృత్తి సదయుఁడగుచు॥౬౨॥క॥అని పలికిన కుసుమాంబిక ।మనమున సంతో

వమగ్నమానసయగుచుఁ। తనయులఁగాంచెడి వేడుకఁ। దనపతి దైవంబుగాఁగ దలఁపుచుసుండెన్ ॥౬౨॥ వ॥ అంత సూర్యోదయంబగుటయు మేల్కాంచి నిత్యకర్మంబులుదీర్చి నగరేశ్వరుముఖమంటపంబు జేరి॥౬౩॥ మ॥ పరమజ్ఞాన తపోగరిష్ఠులతపః ప్రారంభగాంభీర్యులన్। గరిమాధఃకృతభోగిపుంగవుల తర్కప్రౌఢతాబ్రాహ్మలన్। గురువేదాది పురాణశాస్త్రవిలసద్గోష్ఠీ పరిజ్ఞాతలన్। వరధర్మాత్ములఁ గృపారససుధావార్ధిప్లుతులన్ విప్రులన్॥౬౪ వ॥ రావించి యనంతరంబమ్మహాసభకున్ నమస్కరించి తన యభిప్రాయంబు వారలకెరుంగించువాఁడై యిట్లనియె॥౬౫॥ క॥ సంతానము సంపాదికి। సంతా

## ⟹ *కుసుమశెట్టి పుత్రకామేష్టి జేయనుద్యోగించుటం* ⟸

నంబై తనరుఁ సంతతమునత। త్సంతానమెట్లుగలుగును। సంతసమున నానతిండుసభవారనినన్॥౬౬॥ వ॥ వారలయందు భాస్కరాచార్యుండిట్లనియె-నీవు నగరేశ్వరుండై పరమేశ్వరుప్రీతిగాఁ బుత్రకామేష్టిఁ జేసినఁ బుత్రవంతుండవయ్యెదవని పలికిన మహాప్రసాదంబని మ్రొక్కి శుభముహూర్తంబున నా భాస్కరాచార్యునాచార్యుంగా వరించి విధివంతంబుగా ఋత్విగ్గణంబులఁ గూడి పుత్రకామేష్టి సేయుచుండ సప్తాహంబులు జనిన యనంతరంబ॥౬౭॥ చ॥ అనలుఁడు శ్వేతకేతుఁడు మహాధ్వరమొప్పఁగఁ జేయుచుండఁగా। ఘనముగ నాజ్యధారలధికంబుగఁ గ్రోలియజీర్ణనొందునాఁ। డనఘు మహాప్రతాపుకడఁ గునజీర్ణమున్ బొందునాఁటిదీరెనం। దమపమశౌర్యుఁ డొక్కఁడు గలండె యటంచుఁ బ్రసన్నమూర్తియై॥౬౮॥ చ॥ హరునకు విన్నపించిన మహాకృప నొందిన దాశివుండుదా। నరుదుగనాత్మశక్తినఘహారిణి మౌక్తికతారహారిణిన్। గరమనురక్తిఁ జూచి సుతకారణమధ్వరమొప్పఁ జేయనా। వరవణిగన్వయాఢ్యునకు వశ్యమునీవు ప్రసన్నమూర్తియైయ్యెన్॥ క॥ కామితఫలములనొసఁగును। శ్రీమహితునిగా నెనచుఁ శీఘ్రంబనినన్। సోమకళాధరునాజ్ఞా। సామర్థ్యంబెరిగి శక్తిసంభ్రమమెసఁగన్॥౭౦॥ గీ॥ అగ్నికుండమధ్యమాంతరంబునయందు। నద్భుతంబుగాఁగనభవుశక్తిఁ। దగ ప్రసన్నయైన తాత్పర్యమున మ్రొక్కి। శిరము

నంబుఁజేర్చిరాకరయుగంబు ॥౭౧॥ దండకము. జయజయశ్రీమహాలక్ష్మీ దేవతేశక్తికంకాళిహుంకారిణీ ప్రాణరక్షీకరాళీ త్రినేత్రీ త్రిశూలీ త్రివేదస్వరూపీభవానిశ్రియందేహిమేపాహిమాందేవదేవిత్రయీనావనాదేనిర్వికల్పేసమస్తాపదుద్ధారిణీధ్యానదీనావటీష్టీగరిష్టేభజనిష్టాదినంసేవ్యమానాంఘ్రిపద్మేశరణ్యేనమస్తేనమస్తేదేవితుభ్యంనమస్తే ॥౭౨॥ వ॥ అనుచునానేకప్రకారంబులస్తుతియించినకుసుమాఖ్యుంజూచియంబయిట్లనియె॥ ౭౩॥ క॥ సంతసమునవీకాంతకు। సంతానముగల్గుననుచుసంతసమొసఁగన్। సంతానార్థప్రదమగు। సంతానఫలద్వయంబుఁజతురతనొసఁగెన్ ॥ ౭౪॥ వ॥ యిట్లమ్మహాశక్తిప్రత్యక్షంబైవరంబొసఁగినఁగుసుమాఖ్యుండునంతసిల్లియుండెనంతశక్తియంతర్ధానంబుజేసెయనంతరంబఋత్విగ్గణంబులకునానేకబ్రాహ్మణులకుభాస్కరాచార్యులకునిష్టంబులైనవస్తుసంపదలొసంగి

——*కుసుమగంధిగర్భంబుదాల్చుట*——

సుఖంబుండెనంతకుసుమగంధిగర్భంబుదాల్చి॥౭౫॥ ఉత్పలమాల. గాఁ బ్రథమదిశస్థితిజంద్రునిచంద్రికాప్రభన్। భూజనులెల్లమెచ్చగనుబొందుగసొంపునఁగాంచెసుస్థితిన్। వైజననంబునన్శుభదివాకరచంద్రముఖగ్రహాళివి। భ్రాజితలగ్నవేళతగభామినిపుత్రునిఁబుత్రికామణిన్ ॥౭౬॥ వ॥ అయ్యా

——ఆకుసుమశెట్టికిబుత్రికాపుత్రోత్పత్తిగలుగుట——

వసరంబున ॥౭౭॥ క॥ మందానిలములువొలయఁగ। బృందారకపుష్పవృష్టిఁబ్రియమునఁగురియన్। మందరనినదంబులసుర। దుందుభులునుమ్రోసెనపుడుధూర్జటిఁగరుణన్ ॥౭౮॥ వ॥ అంతనక్కుసుమాఖ్యుండునుప్రమోదభరితహృదయారవిందుండైజాతకర్మక్రియాదిశేషంబులువిధ్యుక్తంబుగాఁజేయించికుమారునకువిరూపాక్షుండనునామంబిడిపుత్రికకువాసవియనునామధేయంబొసరించెనంతవారలుదినదినప్రవర్ధమానులనుచుఁదల్లిదండ్రులకుఁబ్రియంబులొనగ్చుచుండిరనిచెప్పినఖిగ్గతదుఃఖాతవృత్తాంతంబెట్లయ్యోవనియడుగుటయు ॥౭౯॥ చ॥ వరహితధర్మవర్తనుడుభాస్కరపండితసవగర్భ

రక్షకుల్। గురునయనీతికోవిదులుగుంభితవాక్యనిరంతరోన్నత।స్థిరతరకాతు శాగ్రగుణశీలురుశీలవతీసతీమనో।హరులువురారిపాదజలజాగ్రమదాళు లువైశ్యులిమ్మహిన్॥౭౯॥మాలిని॥ధనకనకవికాసుల్ ధర్మసంచారభాసుల్ కనకకుధరధైర్యుల్। కల్పితానల్పచర్యుల్।మనసిజరిపుభక్తుల్ మానినీచిత్త సక్తుల్ ।వినయఘననివాసుల్ వేద్యపెన్గొండవాసుల్॥... ... ✻

✻గద్య✻

✻ఇది శ్రీసరస్వతీవిలాసచరణసరసీరుహమకరందబిందు సందోహమ✻

✻ధురంధురీణమధుకరాయమానమానససరసకవితావిలాసగ్రాగు✻

✻రుభాస్కరాచార్యనామధేయప్రణీతంబైనవైశ్యపురాణం✻

✻బనుమహాప్రబంధంబునందుఁబెనుగొండవర్ణనంబును✻

✻కుసుమశెట్టిబుత్రకామేష్టిఁజేయుటయు వారలకు✻

✻బుత్రుండునుబుత్రికయుజనియించుటయు✻

✻వారికి నామకరణాదిశుభలగ్నములొనర్చుటయు✻

✻ననుకథలంగలదిపంచమాశ్వా✻

✻సము✻

✻✻✻✻✻✻✻
✻✻✻✻✻
✻✻✻
✻
✻
క

* శ్రీరస్తు. *

---

## వైశ్యపురాణము.



### షష్ఠాశ్వాసము.



* శ్రీమద్వేంగీదేశ।గ్రామమహాగిరిపురప్రకాశితబుద్ధి।గ్రామణులు రాజరాజ।శ్రీమంతులు గీర్తిపిజితశేషులు వైశ్యుల్ ॥౧॥ వ॥ ఆకర్ణింపుడు దరువాతివృత్తాంతంబెఱుంగించుటకై పాలంకాయనఋషివర్యుండు వైశ్యఋషులకిట్లని చెప్పందొడంగెనట్లు పాసవిదినదినప్రవర్ధమానయగుచుండనొక్క రాజు దనకువివాహార్థంబడిగెనని నవినయవైశ్యులాఋషివర్యునకిట్లనిరి ॥౨॥ క॥ వారెవ్వఁడతనివంశము।పూఁడిమితో వానిపురము పూర్వవిధంబుల్।వేడుకతో నెరుగింపుము।పాడిగనన వారికతఁడు బలికెఁ బ్రీతిన్ ॥౩॥ క॥ శ్రీమార్కండేయముని।స్వామికి నిలయంబనంగ జగతిన్ దివిష।ద్ధామము రాజమహేంద్రుని।నామంబున నొప్పు పురము నవ్యస్ఫూర్తిన్ ॥౪॥ సీ॥ శ్రీగౌతమీదివ్యసింధుపావనతోయకణపిమర్దితపారకల్మషంబు।ప్రకటమార్కండేయపరమేశకారుణ్యసంభవైశ్వర్యశాశ్వతంబు।దానధారాసారదంతావళోదారఘీంకారవైఖరీసంకులంబు। జవవిక్రమక్రియాజనితపౌరుషఘనఘనతురంగమవీరకలకలంబు।రత్నధనధాన్యవస్త్రహిరణ్యరజిత।సారఘనసారమృగనాభిచందనాఢ్య।రమ్యతరపణ్యవీధికారాజితంబు।సాంద్రవిభవంబు రాజమహేంద్రపురము ॥౫॥ వ॥ ఆపట్టణంబునకధీశ్వరుండు ॥౬॥ ధూర్జటిపాదభక్తుండరిదుర్గపిభేదనశౌర్యశాలిన్యా। యార్జితవైభవుండు విబుధావనకల్పకుండార్యసన్నుతుం।డజనావనవర్ధనుండహర్పతితేజుండు విష్ణువర్ధనుం।డార్జితసర్వసంపదల

నొప్పు మరాజను హేంద్రనాథుఁడై ||౬|| క|| రాజకళాధరభర్తుఁడు| రా
జకులోత్తముఁడన్యరాజయశస్తే| జోజయశాలై వరఁగును| రాజతచాళుక్య

—విష్ణువర్ధనుండను రాజు దిగ్విజయంబు సేయుట—

వంశరక్షకుఁ డెలమిన్ ||౭|| వ|| యతం డొక్కనాఁడు దిగ్విజయంబు సేయుత
లంపునకుమారకంఠీరవుం జూచియిట్లనియె|| ౮|| క|| జవతురగరథేభభట|
ప్రవరులతో న్నృపతు లెల్లరావ లెవశమిమా| దివసము దిగ్విజయమునకు| నవసర
మని చాటఁ బంపు మందరు నేరుగన్ ||౯|| వ|| అనుటయు నట్లకాక యని యాస
చివేంద్రుఁడు చాటఁబంచిన| జనపతు లెల్లను బ్బిఘన సాహసశౌర్య మహోద్ధు
రీణులై| యనుగత ఘోటకద్విపరథాధికయోగసమన్వితంబుగా| మునికొని
విష్ణువర్ధనుని ముంగరసిల్పిరి చిత్రవైఖరిన్ || ౧౦ || వ|| యనంతరంబావి
ష్ణువర్ధనుండు దిగ్విజయాకాంక్షంబు శుభముహూర్తంబునఁ గదలెనయ్యవ
సరంబున|| ౧౧|| సీ|| చతురంగబలవేగసన్నాహపదసముద్ధతరజఃపటలంబు
దిశలఁగప్పె| గంధసింధురఘటాకర్ణతాళోద్ధూతపవనంబుత ద్రజఃపటలినె
డవఁబుహురథస్తంభశుంభద్రత్నకేతుకాంతులునభంబునఁ జెకటులుగఁజే
య| యురుఖడ్గసంఘర్షణోద్ధూతవిస్ఫులింగములు దిక్కులకుఁ బ్రకాశమొ
సఁగ| ఘోటకాటోపహేషితకుంజరోగ్ర| మహితఘీంకారఘోషభీషణప్ర
తాప| కార్ముకజ్యారవంబులొక్కటఁ జెలంగ| శిరులఁబెంపొంద యారాజసే
ననడచె || ౧౨ || వ|| ఇట్లమోఘవీర్యుండై వెడలి చనిచని కార్తవీర్యుండే
లెడిమాహిష్మతీపురంబుచేరఁ జని యక్కడకంటకపర్వతంబున సేనలు విడి
యించిన || ౧౩ || క|| వచ్చిన కురుపభురాకతు| పుచ్చ రమున కురుమరాటమ
గధాదులుసొం| పెచ్చిన మదమున వారలు| జెచ్చరఁదలపడిరి వీరజనులరుదం
దన్ ||౧౪|| వ|| ఇట్లిరుదెరంగులవారు పోరి రాసమయంబున| గీ|| విష్ణువర్ధన
రాజుతోవిగ్రహించి| పుడసిరచ్చటి రాజులమత్యులెంచ| కడమ తక్కినరా
జులు గర్వముడిగి| శరణనుచు మ్రొక్కి రాతనిచరణములకు ||౧౫|| వ|| ఆ
సమయంబున| సీ|| హయవధూరత్న హేమాంమలు కానుకల్ మును పురాగొని
వచ్చిమ్రొక్కునృపులు| శరణాగతత్రాణసంపన్నుఁడితఁడని కోసరక సేవిం

చికొలుచునృపులు డగ్గరవచ్చినతబ్బిబ్బులౌనసిదూరంబుగాను న్నె తొలఁగు
నృపులు। కానయొకఁడైనబాహువిక్రమము మెరపఁగలువ లేఁడయ్యె బలశ
క్తిఁగలిగియుండె।శౌర్యదుర్వారనిర్భరధైర్యగర్వ।జనితసత్కీర్తి విష్ణు
వర్ధనుని దాటి ॥ ౧౬ ॥ వ ॥ ఇట్లు నర్మదాతీరంబునం గలరాజులెల్లను
వెంటరాఁగదలి నానావిధంబులగు దుర్గంబులు సాధించి వారలచే నుపాయ
నంబులుగొని యచ్చటచ్చట నిజవిజయస్తంభంబులు నిలిపి జనుసమయంబు
నం గల్యాణపట్టణాధీశ్వరుండగు సామంతక్షితీశ్వరుండును।తద్దేశవర్తులగు
రాజులును బ్రతిఘటించిన విష్ణువర్ధనుండు విజృంభించి విజయసింహవిక్ర
మశాలి-వీరసేన-సుమంత-శాంతన-చంద్రచూడ-సింహధ్వజ-సునంద-నా
మంద-విక్రమ-బాహుఖడ్గ-భీమవిగ్రహ-సమగ్రాయుధ-శుభగ్రీవ-మహావీ
ర-కంఠీరవ-సుబుద్ధి-సర్వజ్ఞులను షోడశరాజప్రధానులును-మరియు విక్రమనీ
తి-బంధుప్రభాకరులాదిగాఁ గలయనేక సేనానాయకులుం గలసి వారల నిర్జి
చితత్పురంబులు గ్రహించి యచ్చోటు గదలి-కురు-వరాట-అంగ-వంగ-శక
ఘూర్జర-నార్కట్టగాంధారదేశంబులు సాధించి-వచ్చిచో త్రివేణీసంగమస్నా
నంబునఁ గృతస్నానుండై యచ్చటఁ గదలి యయోధ్యఁ జేరి యచ్చటనుండి హరి
ద్వారంబునకునై మిశారణ్యంబును గని యవ్వల సింధువు దాటి కాశ్మీరదేశం
బు జేరి వారల నిర్జించి సవాలక్షపర్వతంబులు జూచి యచ్చటనుండి యనేక
దేశంబులు గడచి శబరపుళిందబర్బరాది దేశంబుల వారల జయించి యచ్చట
నుండి దక్షిణాభిముఖుండై కొంకణదేశంబు బ్రవేశించి వచ్చి మసను ద్రదేశ
వాసులగు రాజన్యుల జయించి యచ్చటనుండి సహ్యమదర్దరపర్వతంబులు
గడచి సేతువుం జేరె ॥ ౧౭ ॥ క ॥ కనుఁగొనె రాజకుమారుఁడు।వనధిం దద్వనధి
గ్రుంకి వచ్చుటరామే*శునిఁ బూజించె నవశ్యము*ధనకనకవిశేషవస్తుతతులొ
సఁగూడన్ ॥ ౧౮ ॥ యచ్చోటు వాసి॥ శా ॥ దండి పాండ్యధరాధినాయకుల
దుర్దాంతోగ్రశౌర్యంబుతో*।దండోద్దండతరప్రభావము।న శ్రీరంగంబు
సేవించి చం*ద్రుం డచ్చోటమరంతకల్మషముదొంతుల్ డుల్లుచ్చునాక్రొల్న రే*

యొండ్రఁ గాచిన వాసవంశజుఁడు కాయంబందునర్థదోఁగినన్ ॥ ౧౯ ॥ గీ ॥
మహితమైనట్టి శ్రీరంగమంటపంబు । జొచ్చి పరవాసుదేవుసజూడియంత ।
చిన్మయాకార సర్వేశ శ్రిత జనార్తి । హరణ శ్రీరంగనాయక యనుచు
మ్రొక్కి ॥ ౨౦ ॥ వ ॥ మరియు ననేకవిధంబులస్తుతియించియచ్చోటు వాసి ॥ ౨౧
గీ ॥ జలమయంబైనయట్టియాజంబు కేశ్వఁ । డగుమహాదేవుభజియించి యచ
టనుండి । విశ్రుతములైనయుభయకావేరులందు । తానమునకునువిష్ణువర్ధ
నుఁడువచ్చిన ॥ ౨౨ ॥ వ ॥ యిట్లువచ్చి ॥ శా ॥ వీరాగ్రేసరనాయకుండుభయకావే
రిన్ బ్రియంబొప్పనిం । పారన్ తానముజేసిదుష్టరిపురాజాధీశులౌచోళధా ।
త్రీరాజేంద్రులఁ జేరగాఁగదలివారిన్ గెల్చి శీఘ్రానతా । నారూఢిన్ దగు
కుంభకోణమునకాహ్లాదంబునన్ జేరుచున్ ॥ ౨౩ ॥ వ ॥ అచ్చటకుంభేశునంద
ర్శించిమధ్యార్జునంబుజేరియందుగలమహాదేవుంబూజించిచిదంబరంబు
నకుజనుదెంచెననినవిని వైశ్యులమ్మహాత్మునకిట్లనిరి ॥ ౨౪ ॥ ఉ ॥ అనఘామహా
నికులాగ్రగణ్యమహాత్మా పుణ్యచారిత్రసద్ధనుడారాజు చిదంబరంబున
నువెట్కఁగాగనేమెమిగాంచెనువచ్చె తరియాత్రప్రభావములు గాంచిదే
శమాహాత్మ్యములే । వినుపింపాతనివెంటనంటికొలిచేవిఖ్యాతులౌరాజు
లన్ ॥ ౨౫ ॥ క ॥ అనుమాటకుమునినాయకుఁ । డనుమానములేక వారికంతఃక
రణంబునననుభవిష్యత్కథపనుఁ । డనుచునుమృదుమధురవాక్యములరగఁబల్కి
క్కెన్ ॥ ౨౬ ॥ ఉ ॥ శ్రావ్యముగావినుండునృపరాజశిఖామణియైనయట్టికా । ర
వ్యుడువిష్ణువర్ధనుఁడురాజకళాధరభర్తఁడట్లశ్రో । తవ్యుఁడునయ్యెనచ్చ
టచిదంబరపూర్వరహస్యమెల్లను । రవ్యవరేణ్యులారరిపురాజవిభాళుబ

## విష్ణువర్ధనుని సేనాపరిగణనంబు

లంబులన్నియున్ ॥ ౨౭ ॥ వ ॥ వివరించెదవినుండు ॥ పంద్రెండులక్షలునలుబది
రెండు వేలుకాల్బలంబును-నందు రెండులక్షలనిరువది వేలు విలుకాండ్రును
రెండులక్షలుపందొమ్మిది వేలుఖండాయుధులును-లక్షయునలుబది వేలుగో
పశీమపడిగెవాగెలును-లక్షముప్పది వేలుకైతలును-నయిదులక్షలతొమ్మ

నూ్నరుగుఱ్ఱంబులును ఉత్తమలక్షణంబులు ముప్పదిరెండువేలు యుష్ట్రంబులును - నరువదియెనుమవేలు గంధసింధురంబులును - నన్నియోరథంబులును మొగిలీరువిన్మాదేశపాశ్చాత్యులు రెండులక్షలు నిరువదెనిమిది వేలు గుఱ్ఱపు రౌతులును - నింతటిబలంబు విష్ణువర్ధనునియను చరులై గొలువ దక్షిణదేశంబులు సాధించిమగుడివచ్చునెడ కావేరీనది తూర్పున సముద్రంబునంగలసిన సంగమస్థలంబునకనతి దూరంబున చిదంబరం బనుమహాస్థలంబులమహిమలు మున్నువిన్న వాఁడై తిరుమట్టువృద్ధాచలారుణాచలమరకతవల్లీసాధులంగాంచియచ్చటనుండి కాంచీస్థానంబు ప్రవేశించితత్పురంబుదర్శించియేకామ్రనాథు కామాక్షీ సహితంబుగాఁబూజించి నుతియించి మ్రొక్కిలిడి వేదవతిఁజేరంజను ||౨౬|| క|| ఆగమవిధిని నృపాలుఁడు । వేగవతీస్నానమాడి వేగమెకనెనా । భోగవతిఁదల్పునటునా । యాగమవిదులైన వైష్ణవాగ్రణులలరన్ ||౨౭|| క|| ధన్యపవస్థుఁడురిపురా । జన్యులనక్కగిన రాజభయముల నెల్లన్ । జన్యమునఁగెలిచిన్న పముా । ధాన్యుండా కంచివరదరాజులఁగాంచెన్ ||౨౮|| వ|| మఱియు శేషగిరిదర్శించియందలి తీర్థంబులనవగాహనంబుజేసియచ్చటనుండి వెంకటాచలంబు జేరంజని ||౨౯|| సీ|| సద్భక్తి రెండవచక్రవర్తియొసంగుడంబైనవరకిరీటముధరించి । రవివంశజుండైన రాఘవుఁడిచ్చి నగణుతింపరావిభూషలను దాల్చి । తనకుముత్తాతయౌ ధర్మజుఁడిడినట్టిఘనమైనయొడ్డాణమనువుపరచి । బహుయుగాంతరముభూపాలురర్పించినయమరేంద్రమణులువక్షమునదాల్చి । రూపగాంభీర్యసద్గుణరూఢసుహితు । నెమ్మెకాడైన శ్రీవెంకటేశుఁజూచి । శరణుశరణని మ్రొక్కెసాష్టాంగమవుడు । నిడుచునవ్విష్ణువర్ధనుఁడెలమితోడ ||౩౦|| వ|| అచ్చటఁ బంచరాత్రంబులుండి కాళహస్తిజేరియద్దేవుదర్శించిపూజించినుతియించి యచ్చోట్పటువాశివనిచన ||౩౧|| ఉ|| నందిగిరీంద్రసంభవజనప్రకరౌఘసమూహశైలపా । రందరవజ్రధారతటిరంగదభంగురభంగసంగతా । మందసరో

